శ్రీరస్తు.

శ్రీమతే రామానుజాయనమః

# గొల్వేపల్లి

# శశిరేఖాపరిణయ నాటకము.

ఇది

గుడివాడతాలూకా గొల్వేపల్లి గ్రామవాస్తవ్యులగు

## వల్లభనేని చౌదరిగారిచే

రచియింపఁబడినది.



రచయితగారి దౌహిత్రుడును

మ॥ రా॥ శ్రీ తుమ్మల రామబ్రహ్మంచౌదరి (B. A., B. L.) గారి

పుత్రుడునగు శ్రీ తుమ్మల చౌదరిచే

ముద్రించి ప్రకటింపఁబడినది.

ముద్రణము : 500.



సర్వ...

వెల రు 0—12—0

1956.

శ్రీరస్తు.
శ్రీమతే రామానుజాయనమః

గొల్వేపల్లి

# శశిరేఖాపరిణయ నాటకము.

గుడివాడతాలూకా గొల్వేపల్లి గ్రామవాస్తవ్యులగు
వల్లభనేని చౌదరిగారిచే
రచియింపబడియె.
పండితులచే పరిష్కరింపఁబడియె.

3759

తృతీయ ముద్రణము : 500.

రచయితగారి దౌహిత్రుడును
మ॥ రా॥ శ్రీ తుమ్మల రామబ్రహ్మంచౌదరి (B. A., B. L.) గారి
పుత్రుడునగు శ్రీ తుమ్మల చౌదరిచే
ముద్రించి ప్రకటింపఁ బడినది.

బాలాత్రిపుర సుందరీ ప్రెస్
గుడివాడ.

 వెల రు 0—12—0

1956.

# వి జ్ఞా ప న ము

ఆ ర్యు లా రా !

కృష్ణామండలమున గుడివాడ తా॥ జమీగోల్వేపల్లి గ్రామంబు అస్మదీయవాస స్థలంబు, కమ్మ కులజుండ నిట్టి నాకు నాటకంబొండు రచించునట్టి యానందంబు డెందంబున గందళింప నాటకుల కుపయుక్తంబగు నటుల సులభశైలి నీ నాటకంబు శ్రీమద్వేణుగోపాలస్వామి కంకితంబుగా శక్తికొలంది రచించితి. గాన నీ నాటకంబందెట్టి యపశబ్దములున్నను నా పాండిత్యలోపంబు లుగ్గడింపక లోకమందు వచ్చియురాని చిలుకపలుకు లాలించి ఆహాయని యెట్లు సంతసింతురో అట్లానందించి నన్ను మన్నింతురని నమ్మి మిక్కిలి ప్రార్థించుచున్నాను.

ఇట్లు విధేయుడు,

వ ల్ల భ నే ని చౌ ద రి.



శ్రీమతే రామానుజాయనమః

# శశిరేఖాపరిణయ నాటకము.



శ్రీ

శ్రీ రామాపతి నిన్ను నే మనమునన్ ♦ సేవింతు నెల్లప్పుడున్
పారావారగభీర వైరివారణా ♦ ఫాలాక్షసంసేవితా
కారుణ్యాకర గొల్వేపల్లినిలయా ♦ కంజాతపత్రేక్షణా
రారా కోరికలిచ్చి గావగదరా ♦ రాకేందుబింబాననా!

క. హరిని పర మేశు నీశున్ । హరిశశధర నేత్రు విష్ణు ♦ హరిరిపుహత్రిన్
హరిహయవినుతాంఘ్రిద్వయు । హరివిక్రము నేనుగొల్తు ♦ నతు
లితభక్తిన్.

క. విషధరవర్ణ శరీరుని । విషధరగంభీరగుణుని ♦ విషధరశయనున్
విషధరవినుతాంఘ్రిద్వయు । విషధరరాడ్వైరివత్రు ♦ వేడ్క
దలంతున్.

గీ. శంకలేకను వేవేగ ♦ లంకజొచ్చి । లంకిణిని గూల్చి సీతకు ♦ జంకు
లేక । నినకులాగ్రణిముద్రిక ♦ నిచ్చినట్టి । ప్రకటబలవంతు హను
మంతు ♦ ప్రస్తుతింతు.

దరువు — నాటరాగం - జంపెతాళం

జయపతంగతురంగ | జయభక్తభయభంగ | జయనీలవర్ణాంగ
జయదైత్యభంగ ॥జయ॥ జయసుందర జితమారా । జయ మేరునగధీర।
జయదయాపార । జయకౌస్తుభహార ॥జయ॥ జయగొల్వేపల్లి

పాల । జయ వేణుగోపాల । జయసురమునిగానలోల । జయసుగుణ జాలా ॥ జయ ॥ జయ ॥

దర్వు—అరభిరాగం - ఆదితాళం

రారాకరుణాకర బ్రోవవదేరా । సారసాక్ష మొరవిని॥ రారా కరు॥ యేరా। మారజనక యిటురావేరా । కారుణ్యాకర మహిపాగా। నారదనుతగానవదేరా । వేమారు వేడితిని రారా । పారావారగభీర। మేరునగధీరపరాత్పర ॥ రారా ॥ యేలా । పిలచినాను బలుకవదేలా। వలుమారు వేడితిని చాలా । నను బ్రోచుటకును జాగేలా । యులుక బూనుటదియొక మేలా ॥ కరుణాలవాల గోపాల సుజన వరి । పాల కనకచేల సుగుణజాల ॥ రారా ॥ యీశ । దాసజనమనోల్లాస । వాస వనుతహృషీకేశ । గోల్వేపఞ్పురనివాసా । దోసిలొగ్గితిని లక్ష్మీశ । జగ । దీశ యీశ రిపునాశకేశవప । రేశ చిత్ప్రకాశ భవవినాశ॥ రారాకరు॥

గీ. శ్రీరమానాథు సేవించి ♦ చిత్తమందు । పద్మజునివేడి నగసుతా♦ పతికి మ్రొక్కి । శ్రీకి వాణికి దుర్గకు ♦ సేవజేసి । సంస్కృతాంధ్ర కవీంద్రుల ♦ సంస్తుతింతు.

గీ. అనఘు గుదిమెళ్ళవంశ జ♦ రాబ్ధిచంద్రు । వైష్ణవోత్తము నతులిత ♦ వాగ్విలాసు । సురుచిరాకారు బుధజన ♦ స్తుతచరిత్రు । వెంకటాచార్యు మద్గురు ♦ వినుతిసేతు.

గీ. శ్రీలజెన్నొందు గుడివాడ ♦ చెంత నఖిల । కనకగోపుర హర్మ్య ప్రా♦కరముగల్గి । జూచువారికి మిక్కిలి ♦ చోద్యమగుచు భువి వెల యుచుండు గొల్వేప ♦ ల్పూరు మొకండు

సీ. శ్రీరమానాథుని ♦ సేవింతురెపొద్దు। నియతితో వల్లభ♦ నేనివారు। సంస్కృతాంధ్రంబులు ♦ చదువుదు రెపొద్దు। నియతితో వల్లభ ♦ నేనివారు। కవివితతికి పూజ ♦ గావింతు రెపొద్దు । నియతితో వల్లభ♦ నేనివారు । సత్పాత్రదానముల్ ♦ సలుపుదు రెపొద్దు । నియతితో

వల్లభ • నేని నాకు । అట్టివల్లభ నేని వం • శాబ్ధి చంద్రు । డనగ
సుయశః ప్రపూరిత • శాంతసాకరు । డగుచు నగను గోనగా బ్రహ్మ •
యాభిధాను । డలరుచుండును బుధనివహంబులలర.

ఆ.వె. అట్టిబ్రహ్మయాఖ్యు • డతిగుణవతియగు । బుల్లెమాంబ యందు •
పొసగ నొక్క । పుత్రికాలలామ • పుత్రత్రయంబును । గాంచె
పూర్వపుణ్య • గౌరవమున.

గీ. వారియభిధానములు నేడు • వరుసతోడ । జెప్పెదను వేడ్క పుత్రిక •
జిలిగి నూరాంబ । రామకృష్ణుండు సోదరి • రామశాస్త్రి । యనగ
బుత్రులు వెలసిరీ యవనిలోన.

గీ. అట్టి పుత్రత్రయంబులో • నగ్రజుండు । భక్తియోగ క్రియాజ్ఞాన •
భావయుతుడు । రామకృష్ణాహ్వయుడు గవి • రంజితముగ । గయుని
నాటకము రచించి • ఘనతగాంచె.

క. అరామకృష్ణవనుజుడ । ధారుణి సోదరి యటంచు • తథ్యముగ
ననున్ । గూరిమితో నీ నాటక । మేరచియించితిని బంక • జేక్షణు
కరుణన్.

గీ. వినుడి బుధవర్యులార నా • విన్నపంబు । నవరసస్ఫూర్తి మైన యీ •
నాటకమున । శబ్దదోషంబు లున్న సుశబ్దములుగ । నన్మతి
దలంచరయ్య వాత్సల్యముంచి.

సంధి॥ మాట. ఇట్లిష్టదేవతా ప్రార్థనంబును, పురాతనాధునాతన సంస్కృతాంధ్ర కవిస్తోత్రంబునుం గావించి శ్రీమద్వేణుగోపాలస్వామి కంకితంబుగా నొనర్చబూనిన శశిరేఖాపరిణయంబను గేయప్రబంధంబునకు కథా క్రమంబెట్లనిన.

ద్వారకునిదరువు ఆరభిరాగం ఆదితాళం

ద్వారకుడరుదెంచెను । త్వరితగతి ముదంబున ॥ద్వా॥ సారెసారె
కును కేరినవ్వుచును । చారులందు సర్దారుడనను ము ॥ద్వా॥ ఫలాభాగ

మునందున । నూర్ధ్వపుండ్రము । చాలారంజిల్లుచుండగా । మేలిమైన బంగరుయుంగరములు । మెరయునేళ్లు (వేళులనుధరించుక ॥ద్వా॥ శిర మునపాగాజుట్టి । చెవులపోగులు మెరయుచుండగ బెట్టి । సరవిగొల్వే పల్పురవరుడనదగు । సరసిజనాభుని । సన్నుతి జేయుచు ॥ద్వార॥

సూ॥ మాట. అరే యూర్ధ్వపుండ్రధారివై యిచ్చోటికి చెచ్చెర విచ్చేసి యున్నవాడవు నీవెవ్వండవో దెల్పుమురా.

ద్వా॥ దెల్పెద వినుము.

గీ. దుర్జనాళుల దునుమాడి ♦ దోర్బలమున । పరగ సుజనావళుల పరి♦
పాలనంబు । సలుపు బలరామ కృష్ణులీ ♦ సమయమందు । కొలువు
కూటము కరుదెంచు ♦ కోర్కెలలర.

ద్వా॥ సూత్రధార ! రేవతీ మనోరంజనుండగు బలరాముండును రుక్మిణీలోలుండగు శ్రీకృష్ణుండును యీసభాస్థానంబున కరుదెంచుచున్నవారుగాన తద్వృత్తాంతంబు మీకెరుగింపవచ్చితిగాన మీరందరు సందడి సేయక నెమ్మదిగా నుండుడి. నేను వరిగెద.

సంధి॥ ఇట్లుబల్కుచున్న సమయంబున బలరామకృష్ణులు కొలువు కూటంబున నుండి రెట్లనిన.

దరువు - రాగం - కాంభోజి - ఆదితాళం

కొలువుకూటముకువచ్చిరి ॥ బలరామకృష్ణులు ॥కొ॥ సలలిత ముగ యదుపుంగవులందరు । పలువిధంబులను । (బస్తుతిసేయగ ॥కొ॥ ముందుగ మణిమయ స । త్కుండలరుచులు । గండయుగళి బర్వగా। పుండరీకనయనలు గొలువగ యాఖండలాదిదిక్పతులు బాగడగను ॥కొ॥ వారకామినులాడగ । భేరీవాద్యములు భోరున (మ్రోయుచుండగ। తారహారములు మీరి మెరయగను । మారరూపముల మీరివెలుంగుచు ॥కొ॥ కరకంకణములు మ్రోయగా । కాంచనమకుటములు । శిరములందున మెరయగా । ధర గొల్వేపల్పురమున వెలసిన । కరి వరదుండును । గామపాలుడును । కొలువుకూటముకు వచ్చిరి॥

సంధి॥ ఇట్లు బలరామకృష్ణులు కొలువుకూటంబున నుండ నంతి ద్వారకుండు గై వారంబు సేయు విధంబెట్లనిన.

ద్వా॥ యదువంశపయఃపారావార రాకాసుధాకరా! జోహార్!

ద్వా॥ భక్తజనమనశ్చకోర శరచ్చంద్రా! జోహార్! రేవతీ మానో రంజనా! జోహార్. రుక్మిణీలోలా! జోహార్. బలభద్రా జోహార్. శ్రీకృష్ణా జోహార్

బ॥ మా. అరే ద్వారకా! త్వరగా జని ద్వారమందు జాగ్రత్తగా నుండుము.

సం॥ ఇట్లున్న సమయంబున సుభద్రాదేవి వచ్చు విధంబెట్లనిన.

దరువు - దర్బారురాగం - ఆదితాళం

ఇంతి వెడలె సభకు, యింద్రసూనుని ॥యిం॥ కంతుని చేతిపూ। బంతి యోయనంగ॥ యిం॥ కురులునున్న గదువ్వి। కొప్పుగా బెట్టి। విరి సరములజుట్టి। శిరమునగానిడి। చెవుల బాకీలిడి॥ యిం॥ నడు మసి యాడుచుండగా। పడతులిరుగడల, విడెములందిచ్చుచుండగా, కడు వడి నడుగులు। తడబడుచుండగ॥ యిం॥ పలుకుల తేనె లొలుకగా కలికిచూపులు। కలువల గేలి సేయగా, ముసికనవ్వులు వె। న్నెలలు గాయుచుండగా॥యిం॥ కరకంకణములు మెరయగా। తారహారములు, యురమునందున। మెరయగా। ధరణి గోల్వేపల్లి। పురవరుదలచుచు। యింతి వెడలె సభకు॥

సు॥ మా. అన్నా బలభద్రా నమస్కరింపు చున్నాను. అన్నా కృష్ణా నమస్కరింపుచున్నాను.

బ॥ మాట. అమ్మా సుభద్రా గూర్చుండుము.

సంధి॥ ఇట్లున్న సమయంబున శ్రీకృష్ణుండు బలరామునింగాంచి యిట్లనియె.

కృ॥ మాట. అన్నా బలభద్రా! నేనొకటి విన్న వించెద నాకర్ణింపుము.

బ॥ మా. అదెట్లో దెల్పుము మాధవా?

క. మన శశిరేఖకు సర్జున । తనయున కిట జూడ జోడు ♦ దగనొన గూర్చెన్ । వనవిలుకానికి రతికిన్ । ఘనముగ నొనగూర్చినట్లు ♦ కమలాసనుడున్.

గీ. అగ్రగజా నాదు విన్నపం ♦ బాలకించు, మన సుభద్రాత్మజునకు స ♦ మానుడనగ । దగిన పురుషుండు లేడు యీ ♦ జగతిలోన । గాన నీకన్య నొసగుమీ ♦ కామపాలా.

కృ॥ మా అతని చక్కదనంబును నాతని గుణవిశేష విలాసంబులను జూచి భూతలమందాతని సాటినరపుంగవుం డొక్కరుండును గాన్పించడు. అతనికిని యీ నారీరత్నంబునకును దగు గాన వేగమే దినంబులు గడుపక జనంబులు మనంబులు ఘనంబుగా విలసిల్ల పరిణయంబు సేయుము అన్నా బలభద్రా!

సం॥ ఇట్లు బల్కుచున్న సమయంబున సుభద్ర బలరాముని గాంచి యిట్లనియె.

దరువు - బేగడరాగం - చాపుతాళం

బలభద్రా నాపల్కులువిను । పలుమారువిన్న । ప్రార్థించెద యీ । యలివేణివి మేనల్లునకిమ్ము॥ బ॥ ఇందు రేఖకున్న సుందరంబు జూడ । డెందమందున నా । నందమును బ్రిల్లె॥ బ॥ ఇట్టిరూపున నున్నట్టి చెలతలు । గట్టిగను భువి గానరారయ్యో॥ బ॥ ధర గొల్లేపల్లి పురవరు సాక్షి । కరుణించి । చిన్ని । కన్ననొసగుమో॥ భలభద్ర॥

మా॥ అన్నా బలభద్రా!

సు॥ గీ. నన్ను నిట కంపువచ్చాను ♦ నరుకు మీకు । విన్నపము సేతు మని యిట్లు ♦ వేడుకలర । బలికి బంపెను గావున పంకజాక్షి! కరుణతో నిచ్చి మన్నింపు ♦ గామపాలా,

మాట. నీచిన్నికుమార్తెను నాచిన్నికుమారునకిచ్చి యెన్నడు పరిణయంబు జేతురో దెల్పుమన్నా బలభద్రా!

బ॥ మాట. అమ్మా సుభద్రా!

గీ. ఇట్టి బేలతనమ్ము నీ ♦ కేలనమ్మ । గుట్టులను గొట్టిపట్టి యా ♦ జెట్టి
పట్టుపట్టి కంటెనుసధికులు ♦ పరగగలరె । గట్టిగాజేతు పోపొమ్ము
కంజనేత్రీ.

బ॥ మా. అమ్మాసుభద్రా! నీకింత బేలతనంబేల? నిశ్చయంబుగా నిచ్చి పరిణయంబు జేసెద పొమ్ము.

సం॥ ఇట్లు సుభద్ర బలరామకృష్ణుల సెలవుగైకొని దివ్యవస్త్ర భూషణాలంకృతయై హాస్తిపురంబునకేగి యావృత్తాంతంబంతయు చెప్పి సంతోషసాగరంబునన్ దేలుచుండె. అంతకొంతకాలంబునకు పాండవులు మాయాద్యూతంబున కౌరవులకు రాజ్యంబు నోడిపోయి అరణ్యంబులకున్ బోవుచుండ నంత శ్రీకృష్ణుండే తెంచి సుభద్రాభిమన్యులన్ దోడ్కొనిపోయి ద్వారకాపురంబున సుఖంబుగా బోషించుచుండె. అంతనొకనాడభిమన్యుండు శృంగారవనంబునకు విహారంబుగా బోవుచుండె నట్లనిన.

దర్వు - బేహాగ్ రాగం - చాపుతాళం

ఇదేమివనము నా। మదికిది చోద్యమాయె । సుదనుని తేజోర్ రొదలిడుచుండె ॥ఇదే॥ మల్లెతల్లిగిరి। మల్లికాసులను నల్లుకొనుచు విల। సిల్లుచుండె ॥ఇదే॥ సమ్మోదంబున పికమ్ములెల్లగా। నమ్మనజేసె మధు। పమ్ములుప్రమోసె ॥ఇదే॥ జాజులుండె విరజాజులుండె నా। రీజలుండె నట । భూజములుండె ॥ఇదేమి॥

అభి॥ మా. ఆహా యేమియీ చిత్రము! యీ నారికేళ కదళీఖర్జూర పున్నాగ పనస రసాలాది భూజంబుల బారులును, యీమల్లెలు మొల్లలు జాజులు విరజాజులు చామంతులు మొదలగువాని పువ్వుగుత్తుల యందంబును పుష్ప మరందపానంబుచే షట్పదంబులు ఝుమ్మని మ్రోయ చలించుచుండెడు లతాకదంబంబులును శతపత్రసహస్ర పత్రకమలంబులతో నలంకృతంబులైన సరోవరంబులును గల్గి యీ

యుద్యానవవనంబు విరాజిల్లుచుండె. ఆహా! దీనిసుందరంబేమని చెప్ప వచ్చు ఈమల్లెతీగ మొగ్గలు దొడగి మాకందవృక్షంబున నల్లుకొని పెల్లుగా విలసిల్లుచున్నది. దీనిక్రింద పద్మరాగస్థగిత వేదికాస్థలంబుండె. ఇచ్చట కొంతతడవు విశ్రమించెదను.

సం॥ ఇట్లభిమన్యుండు పద్మరాగస్థగిత వేదికాస్థలంబున విశ్ర మించె. అంత శశిరేఖ శృంగారవనంబునకు విహారంబుగా వచ్చు విధం బెట్లనిన.

దర్వు - కమాచిరాగం - చాపుతాళం

యింతిరో యీవనమున చామంతి పువులు జూడరే। సంతస మున కోకిలలు। రంతుజేయ సాగెనే॥ యిం॥ యుల్లమురంజిల్ల జేయు। మల్లెల గనుగొంటిరే, అల్లిబిల్లిగాను చెట్ల। నల్లుకువిలసిల్లెనే॥ యిం॥ కీరశారికములు చాల ఘోరముగను గూసెనే మారుబారి కోర్వ జాల, మానిని యెటులైతునే॥ యిం॥

మాట. యీచామ తిపువ్వుల యందంబును, యీఅల్లిబిల్లిగా నల్లు కొని విలసిల్లెడు మల్లెతీగెల సొగసు జూచితివా సఖి!

మాట యీమత్తమధుకర నికర సరస సంగీత సల్లాప ప్రసంగం బులును కీరశారికామయూరాది పక్షిసమూహారవంబులును వింటివే సఖి!

తొంగిచూచి॥ శ॥ మా ॥ సఖి, యీమల్లెతీగె మొగ్గలు దొడిగి యక్కడక్కడా పువ్వులతో నిండుగానున్నది. దీనిపువ్వులు గోయుదము రమ్మా, [సమీపించి]

మా. అబ్బబ్బా! అగ్నివలె పరితాపము బుట్టించుచున్నదేమమ్మా సుందరాంగీ!

చెలి॥ మా. అమ్మా శశిరేఖా యీ సైకతస్థలంబున గూర్చుండు దము రమ్మా

సంధి॥ ఇట్లు శృంగారవనంబున శశిరేఖ సఖిజనంబులంగూడి యతి వినోదంబుగ బాడుచుండ నా గానంబు విని కీరంబులురాగా శశిరేఖ

కీరం బా॰ సమూహంబునన్ గలసిపోయి యభిమన్యుని చేతిలో జిక్కె, అంత శశిరేఖ తన కీరంబు గానక మనంబున వితర్కించుచుండె; నెట్లనిన;

శ॥ మా. అయ్యయ్యో నాకీరంబెట్లోపోయె, యెట్లు బోయెనో దెలియదాయె యింక నేనేమి సేయుదును.

శ॥ గీ. బిలిచినంతట పలుమారు ♦ బలుకు రాదు । చిలుక యెటుబోయెనో నాకు ♦ దెలియదాయె । జెప్పరేమమ్మ మీరు నా ♦ చిలుకజాడ । యింక నేనేమి సేయుదు ♦ నెట్లుసైతు.

మా. ఆహా నే నేగియీ యరణ్యంబున వెదకి యా చిలుకను దెచ్చెదను.

గీ. లలిత సాల రసాల సా ♦ లంబులార । నింబ జంబీర పనస్రుమ ♦ మంబులార । సరస లుంగలవంగ భూ ♦ జంబులార । సరగ శుకమును జూపరే ♦ బదరులార.

మా. తాల హింతాల సాలరసాలాది భూజంబులార! నాకీరంబెట్లు పోయెనో దెలియజేసి నాప్రాణంబులు రక్షింపుడు.

సం॥ ఇట్లు శశిరేఖ చెలులను విడచి యరణ్యంబున కీరంబునకై దుఃఖించుచుండ తద్వాక్యంబు లభిమన్యుండు విని మనంబున వితర్కించుచుండె నెట్లనిన.

అ॥ మా॥ ఆహా యీ నందనోద్యానవనసమానంబగు శృంగారవనంబున నెచ్చటనో స్త్రీలవాక్యములవలె వినవచ్చుచున్నవి. ఎవ్వరో నారీరత్నంబులు విహారంబుగా వచ్చియుందురు. ఈ పుష్పవాటీరమంబునుండి చూచెదను.

అ॥ మా॥ ఆహా యీ అల్లిబిల్లి గానల్లుకు విలసిల్లునట్టి మల్లెలమొల్లలచే రంజిల్లు తోటలో మెల్లమెల్లన సంచరించుచున్న దీ॥ నారీరత్నం బెవ్వరో గదా దీని సుందరం బేమని చెప్పవచ్చును.

అ॥ క. యీకలికి యెవరిచిన్నదో । ప్రాకటముగనిట్టిరూప ♦ వైభవ మిలలో । నేకన్యకు లేదిట్టుల । నేకతమున నిచటనుండ ♦ నేమికతంబో.

సూ॥ ఆహా యీమోహనాంగి యెన్నతయో యివ్వనంబున చరించుట కతంబెయ్యదియో దీని రూపవిద్యావిలాసంబులు జూడ పరమేష్టి దీనిసృజించి నాపాలికి బనిచినట్లున్నయది. దీని సుందరంబేమని చెప్ప వచ్చు.

(యెవ్వరో సమీపించి జూచెదను. సమీపించి) ఆహా యెవ్వరో యనుకొంటిని. నాప్రియ శశిరేఖయే, ఓహో సుందరాంగీ.

అ॥ కం. బాలామణి యీవనమున । యీలీల జరింపనేమి ♦ హేతువు నేని । న్నాలోకించగ డెందము । వాలాయము వొంగెనిపుడు ♦ పంకజనేత్రీ).

మా॥ సఖీ! నిన్ను జూచినంతనే నన్ను మన్మధుం డన్నరాని దుర్జయంబున కుసుమసాయకంబులచే సాధింపందొడంగె. భవదీయసాంగత్యంబునగాని మచ్చిత్తంబు నిశ్చలంబుగా నేరదు గాన త్వరగా నా సరసకుగమ్మా ఇందుముఖీ!

సంవాదం-దరువు - బ్యాండు స్వరంరాగం - చాపుతాళం.

సారసముఖిరావే । బాలమేలనే చెలి॥ సా॥ దూరమరుగగ నేరిచితివి సు । తారముగ భళీ రయంబుగ॥ సా॥ శశి॥ నారసాంకు యేరనన్ను । సన్నుతించుటేలర యిటువంటి మారుని శరముల బాధకోర్వక బలుకమాకు యీరీతిని । మాట్లాడనేలర॥ సా॥ అ॥ కొమ్మాబంగరుబొమ్మా । ముద్దులగుమ్మా । కమ్మవిల్తుని బలమ్ములుండెటు వానమ్మినందిటటు । గుమ్మరెదవు వే॥ సా॥ శ॥ యేల। యిటుబలుకుటేల। పంతమదేల । పలుగాకి మాటలు । బలుకక నీవు నా । చిలుక నిచ్చి నాకు॥ సెలవిచ్చిపంపుము। సా॥ అ॥ బాలా। సద్గుణజాల । గుబిరకపోల । మాలిమిచేబతిమాలితిన న్ననుకూలముగా మరుకేళిదేల్చుటకు। సారసముఖిరావే॥

అ॥ సీ. ఇంతి నీ ముఖమువ ♦ కీడుగాకయె గదా । పంకజారాతి కళంకియగుట । వనిత నీ మైచాయ ♦ కెనగాకయేగదా । బంగారు నిప్పులో ♦ బడి తరుగుట । బోటి నీచనులకు ♦ సాటిగాకయె

గదా । గ్రావముల్ సిగ్గున ♦ గదలకుంట । చాన నీ స్తనముల ♦ సాటి గాకయె గదా । సింగంబు లడవుల ♦ జేరియుంట । అహహ నీపెంపు నీసొంపు ♦ వర్ణింప । వజ్రకైన హరికైన ♦ నలవియగు నె।జూచి తెందరినో నేను ♦ సుందరులను । గాని యీ లక్షణంబులు♦గానరావు.

అ॥ మా॥ ఓహో సుందరాంగి! నీదు సౌందర్య సౌకుమార్య తేజోవిశేషంబులు జూచువారును, నీ మృదుమధుర గాన సుధారసంబు గ్రోలువారును కుసుమశరంబుల పాలుగాకుందురే సుందరీ!

అ॥గీ. నన్ను బొడగాంచినంతనే ♦ నాతి యిట్లు । మోహమటులదిప్పు కారణం ♦ బేమొ యకట । యేమిసేయుదు నేనింక ♦ నెట్లుసైతు నెట్లు భాషించువాడ నిం ♦ కెద్ది తెరవు ?

అ॥ మా॥ సఖి నీయందు మోహంబుజెందియున్న నాయందనురాగంబునొంది కందర్పకేళీవిలాసంబులచే నానందంబున కాలంబుం చెందించకున్న నే నెందుబోదు మందగమనా.

శ॥గీ. చిన్నతనమునుంచి ♦ చిలుకనుబెంచగా । నన్ను భంగపుచ్చి ♦ నిన్ను జేరె । యిన్నిమాటలేల యింద్రజ♦పుత్ర నా । చిన్నిచిలుక నిచ్చి ♦ సెలవొసంగు.

శ॥మాట॥ ఓహో సుందరాంగా! నావంటి చిన్నికన్నియలపై మోహంబునొందుట ధర్మమార్గమునకు విరోధంబుగాదా.

అ॥మాట॥ యేమేమి సుందరాంగి.

అభిమన్యు - దర్వు - జంఝూటిరాగం - రూపకం.

యేమిసేతు విరహము నే । నెటులసైతు బోవవే । మోహము మోహము నందుకేర్చి। ముద్దునిచ్చి గావవే॥యే॥ యింతిరో బలవంతపు తమి నెంతని సైరింతునే । కంతుకేళి దేల్చినాదు చింతదీర్చి కావవే ॥యే॥ అతులిత బాధములచేత । రతులదేల నివ్వవే। సతతమునమ్మితి । మదికి । సంతసంబు జేయవే॥ యే॥ యెక్కుడైన గోర్కెను నా

తక్కెకిరావేలనే । యొక్కసారి నీదుమోవి నొక్కి చొక్క నీయవే॥
యేమిసే॥

అ॥ మా॥ నీ మృదుమధుర వచనరచనలచే నామదిగల్గు సంశయంబులు గదిసి ముదమొసవించితివి. మదనుం డిదే సమయంబని పదును గల కుసుమప్రదరంబులచే నాయెద గురిజేసి బాధునంజొచ్చెగాన సదయహృదయవగుచు గదిసి కౌగిలియొసంగవే మదవతీ.

సంవాద॥ సీ. విను సుందరాకార ♦ విస్నపంబొక్కటి । నను నీవిచట
నిల్ప ♦ నగరి జనులు । వనితలవిడచి యీ ♦ వనజాస్త్రితేజికై
పనిబూనివచ్చితి పార్థుపత్రి.

అ॥ మోము మోమున జేర్చి ♦ ముద్దిచ్చి వేడ్కతో । కౌగిటజేర్చవే ♦
కమలనయన । చెలియరో నీవెన్ని ♦ జెప్పిన వినువ నా । వలపు
దీర్చవె భ్రమ ♦ నిలుపజాల.

శ॥ చిలుక నీమృదుకరమున ♦ జిక్కియున్న।దనుచు యీరీతి భాషింప
ఘనమె. నీకు.

ఆ॥ పంతమేలను నీకు నే ♦ పతినిగాను। చిలుకనిచ్చెద గాని నా పలుకువినుము.

శ॥ మా, సరసిజాక్షులకు పరిణయంబుగాకమున్న పురుషులం గలయుట ధర్మవిరుద్ధంబగు గదా! గాన పరిపరివిధంబుల భాషింప నలదు సరసిజాక్షా.

అ॥ మా. యేమేమి యేమేమి సఖి!

సంవాదందరువ్వ - జంఝూటిరాగం - ఆదితాళం.

అ॥ పచ్చవిల్తుడు మది నొచ్చగా శరములు। జెచ్చెర గురిచ్చెను। నొచ్చెనో దేహము ॥శ॥ పువ్వుదోటలలో యిటు । పొంచి బోటుల గని। నవ్వుట నీకిది । న్యాయమె బాలిక ॥అ॥ మామకుంతురవని । మదినమ్మినందుకు। మోమాట ముంచక। మోసపుచ్చెదవు ॥శ॥ ధారుణి పురుషులు । ధీరులని వింటు । యీరీతి ద్వరపడ । నిది నీకుజెల్లునే

॥అ॥ కంతుని కేళికై । యింతగా వేడగ । వంతియుదేల నా । చింతలు దీర్పవే ॥శ॥ కులకాంతల లోపల । దలవంపు సేయుకు । పలుమారు వేడితి । సెలవిచ్చిపంపుము ॥అ॥ ధరను గోల్వేపల్లి । పురవరుసాక్షిగ। మరుకేళిలో నను । దిరముగ నేలవె ॥పచ్చ॥

అ॥ మా. పచ్చవిల్తుండు మచ్చరంబున నెచ్చుగా విచ్చలవిడి శరంబులు గుప్పి నాదేహంబు నొచ్చె గాన ముచ్చటదీర మచ్చికతో గుర్పి కౌగిటంజేర్చి పచ్చవిల్తుని కేళి నేలుకొనక మచ్చరంబూనితి విది తగవా యగునా.

అ॥ క. కురులకు మొక్కెద వాక్రుళి । యరుదగు కుచకుంభములకు ♦ నంజలి సేతుణ । గరములు మోడ్చెద గొనుకు । మరుకేళిని దేల్పుమింక ♦ మంజుల వాణీ.

అ॥ మా ఓసుందరీ ! కందర్పుండతిదర్పంబున నాచిత్తంబు దత్తర పరువ విరపుచే నిన్నిటుల బ్రార్థింపవలసె. మీమాటంబులేక నామాటలు పాటింపక మాటిమాటికి చులకనజేసి నన్నలయించుట దగునా? యిది న్యాయపద్ధతి యగునా?

సంవాదం - దరువు - రాగం.

శ॥ యేగా రాజకుమారా మనవిచేకోర। మారాకారా। యిటు బల్కుటేలరా ॥యే॥అ॥ యేరాయిటులాడ । నేలాజాగుసేయ। మేలా రావేలా । బాలా । నమ్మితి । గుణజాలా ॥శ॥ మారునిశరముల । బారికోర్వగలేక । యీరీతి జేయుట యిది నీకున్యాయమా ॥అ॥ మామకూతురవని । మదిని భ్రమించితి నీ । మోము మోమున । జేర్చి ముద్దుబెట్టవే చెలి ॥శ॥ పరపురుషులనద్ద తరుణులు నిల్చుట । వసువుగా దయ్యా । యిటు భాషించ నేలనురా ॥అ॥ పరపురుషుడని ననుబల్కుట మేలటె । తరుణిరో మేనత్తతనయుడ గానటె ॥శ॥ ధరణిగోల్వేపల్లి। పురవరు సాక్షిగ । పరిణయముగాక యీపని సేయనొల్లనురా॥

శ॥ మాట. మావంటికన్నలు పరపురుషులతో సంభాషింప ధర్మంబుగాదు గాన కోపింపవలదు సుందరాకారా.

అ॥ (శశిరేఖహస్తముబట్టుకొని) మా. యేమేమి సుందరీ.

అభిమన్యుడు - దర్బు - రాగం.

విరిబోణి కోరినానే నిను । మరుబాధకోర్వలేనె । తరుణీ నీవాడ గానే నేనిను ॥ విరి ॥ మోహమైన జూపవేమె నీవిటు । మోమాట ముంచవేమే । కామించిరావదేమె ॥ నేనిను ॥ చెలి జాగుసేయనేలా నీవిటు । పలుమాటలాడనేలా । కరుణించిరావదేల ॥ నేనిను॥ ధరలోన గొల్వేపల్లి । పురశ్రీధరుసాక్షి ముద్దిమ్మంటి శరణంటి గావుమంటి నే ॥నినువిరిబో॥

అ ॥ మాట. యేమేమి నన్ను పరపురుషుండని బల్కుటకు నీకు నోరెట్లాడెనే సరసిజాక్షీ!

శ ॥ మా. సుభద్రానందనా! యిట్లు పలుమారు సంభాషింపనేలా.

శ ॥ గీ. వాసవాత్మజపుత్ర యీ ♦ వసుధనీకు । దేవిగాకుందునేని నా ♦ దేహమేల । చెలువుగా నిన్ను నే పెండ్లి ♦ జేసికొందు! నని దలంచుచు నుందు నా ♦ యాత్మలోన ॥

అ॥ మాట. ఏమేమి సఖి! నీకలికిచూపులచే నను వలరాయుని విశిని గావింపుచు పలుదెరంగులగు పలుకులు పలుకుచు నన్నలయించెదవు. వలపునిలుప నలవియే గాంధర్వవిధి నన్నంగీకరించి వరింపుము, చందన గంధి! అదెట్లంటేని

శ్లో॥ బ్రాహ్మోదైవ స్తథైవార్షః । ప్రాజాపత్య స్తథాసురః । గాంధర్వో రాక్షసశ్చైవ । పైశాచశ్చాష్టమోమతః ॥

బ్రాహ్మ్యదైవ ప్రాజాపత్యార్ష రాక్షస గాంధర్వ పైశాచాసురంబులనియెడు అష్టవివాహంబులలో క్షత్రియోత్తములకు గాంధర్వ రాక్షసవివాహంబులు కర్తవ్యంబులని శాస్త్రంబులు ఘోషింపుచున్నవి గాన నందు గాంధర్వవిధి నన్నంగీకరించి వరింపుము చందనగంధీ!

శ॥ మాట. ఓహో సుందరాంగా!

శ|| కం. మనయిద్దరికిని బెండిలి|ఘనముగ బలకృష్ణు లిపుడు ♦ గావిం
చెద రి | ట్లనఘా యింతటిలోపల | మనమిద్దర మిప్పుడు గలియ ♦
మర్యాదగునే.

అ|| యేమేమిసఖి!

దర్బారురాగం - రూపకతాళం.

చల్లనాయె నామనసు | జాగుసేయ నేలనెసఖి ||చ|| కల్లలాడ వలదు నాతో | కలిసియుండ వేమే చెలి|| చ|| చిలుకనిత్తుగాని నాదు| పలుకులు విని గావగదే | వలపు నిలుపజాల నీదు | కులుకుగుబ్బలం దివ్వవె || చ || పంతమేల నీకు నేను పతినిగాన శే చెలియ | కంతు కేళిలోన నన్ను || కౌగలించి గావవేమె ||చ|| ధరణిలోన గొల్వపల్లి పురవాసునిసాక్షిగాను తరుణీనామొరవిని నను కరువుదీర కలయరావే|| చల్లనాయె నామనసు ||

అ|| మాట. ఓ తక్కులాడి! పెక్కుమాటలేల నామక్కువనీపై జిక్కు సొక్కుచున్నయది. మదనుండిదే సమయంబని కుసుమసాయకంబులచే నాహృదయం బదరసేయంజొచ్చెగాన సదయహృదయవగుచు గదిసి కౌగిలియొసంగవే శృంగారవతీ.

శ|| మా. ఓహో సుందరాకారా! అదుగో నాసఖు లరుదెంచు చున్నారు. నాపదంబులు వణకుచున్నవి. నాహస్తంబువిడువుము. నేను పోయివచ్చెదను. (హస్తమువిడుచుట.)

అ|| మా. ఆహా వంకజాక్షి నన్ను బొంకించిపోయె. నేనింక నేమిసేయుదు? నాకేమియు దోచదాయె. దాని సుందరంబు నాకన్నుల గట్టినట్లున్నయది. యిదే సమయంబని కమ్మవిల్తుడు పువ్వుటమ్ములచే నాహృదయమ్ము సొమ్మసిల్లజేయుచుండె. యింక నేమి సేయుదు! హా యిందుముఖి!

అ|| కం|| ఎన్నడు నినుగనుగొందు | నెన్నడు మరుకేళిలోన ♦ నేలుదు
నిను నే, నెన్నడు నీతో బలుకుదు | నెన్నడునిను గౌగ
లింతు ♦ నేనుందువిధీ.

సంధి ఇట్లభిమన్యుండు చింతాక్రాంత చిత్తుడగుచు తన మందిరంబుఁ బ్రవేశించె అంతహాస్తిపురాధీశుండగు దుర్యోధనుండు కొలువుకూటంబున నుండి నెట్లనిన.

దరువు - సావేరీరాగం - ఆదితాళం

రాజువెడలే సభకు । దుర్యోధనుడను॥ రాజు॥ తేజములర దను దీప్తులు మెరయగ । భూజనులెల్లను బొగడుచునుండగ॥రా॥ కర్ణకుండలములే మెరియ। కరకంకణములు॥ దీర్ఘముగను మోగ్రయగ । దుర్జయులగు మన్నసేన సాటల । కర్ణ సైంధవులు గదసి గొల్వగను॥ రా॥ ధరణి గొల్వేపల్లిని। వెలయు శ్రీ । ధరుని ధిక్కరించుచు । సరసవచన రచనల ధ్రువులమది । గరగించెడు గణికాంగనలాడగ॥ రాజువెడలే॥

సం॥ ఇట్లు రారాజగు దుర్యోధనుండు కొలువుకూటంబున నుండె నత్తరి వేశ్యాంగన లాడుచుండి రెట్లనిన.

దరువు - బేహాగ్ రాగం - చాపుతాళం

సరసుడ నినువేడ । ననుగూడరా వేరా॥ స॥ మరుబారి కోర్వలేరా । మాటలాడవదేరా । సుకుమారా । ధరధీరా । ముద్దీరా । రావేరా॥ స॥ పలుమారు । బిలచిన । పలుకవదేలా । అలుకబూనుట మేల । కరుణించిరావేల । చలమేల । జాగేల । శ్రీలోల గోపాల సరసుడ నినువేడ॥

దు॥ మాట. ఓ రే సేవకా! యీనృత్యసంగీతాభినయప్రవీణులయిన గణికాంగనలకు కావలసిన వస్త్రభూషణాదులొసంగి త్వరగా బంపుమురా.

ద్వా॥ అలాగే బంపుచున్నాను రాజా.

సే॥ మాట. ఓహో మోహనాంగులారా! మీసంగీతమున కందరు మెచ్చుకొనిరి, యీ సంగతి కేమిగాని నాసంగతి కేమంటారు?

వే॥ మాట. ఛీ భ్రష్టా యిట్లువచించెదవేని రాజుగారితో జెప్పెదము లేచిపొమ్ము.

సే॥ మాట. ఓయబ్బో అట్లయిన రాజుగారాజ్ఞ ప్రకార మీపత్ర్రభూషణానులన్ ధరించుకొని పోండుపొండు.

సూ॥ ఇట్లున్న సమయంబున త్రిలోకసంచారియగు నారదుండు భగవన్నామంబు జేయుచు వచ్చువిధంబెట్లనిన.

దరువు - కాంభోజిరాగం - ఆదితాళం.

నారదుండు వెడలె, నగసమానధీరుడు ॥ నా ॥ సారకీర్తి విస్తారు డునారుడు ॥ హారహీర నీహారసితాంగుడు॥ నా॥ తోడిరాగము తోడను, హరికీర్తనలు, పాడుచు వీణెమీటుచు నేడు బలుని పుత్రికొరకు కలహము, వేడుకలర గావింతుననుచు వడి॥ నార॥ సురలుప్రస్తుతిసేయగా, తులసీమాల, లురమున మెరయుచుండగా, ధరగోత్రే పల్పురిగోపాలుని, మరువక మదిలో స్మరణజేయుచును॥ నారదుండు॥

నారాయణ, నారాయణ, నారాయణ, హరివాసుదేవ.

నా॥ కం. ఇలలో నెచ్చటనైనను।గలహముగనుగొనక పోద్రిప్పు ♦ గడుపగవశమే । బలరాముపుత్రికొరకే । కలహము గావింతునిపుడు ♦ కడు మోదమునన్

నా॥ మాట. ఆహా నేటిదిన మెచ్చటను గలహంబు గనుపించదాయెః బలరాముని పుత్రికయగు శశిరేఖ కారణంబుగా కౌరవ పాండవులకు గలహంబు పుట్టించెద నందుకు త్వరగా ద్వారకాపురంబునకు బోయెద.

నారాయణ, నారాయణ, నారాయణ,

నా॥ మాట. ఆహా యోరిద్వారకా!

ద్వా॥ మాట. యెవరయాస్వామీః

నా॥ మాట. ఒరే! ఒరే! నన్నెరుగవటరా!

ద్వా॥ మాట. సెభాస్ మాబాగావున్నది పోవయ్యా!

నా॥ అయితే గట్టిగ నాపేరు జెప్పవలెనటరా.

ద్వా|| చెప్పఁకోవయాస్వామీ!

నా|| కం. వారిజభవసుతసయుడ నీ। ధారుణిసంహారకుడటంచు ♦ తథ్యముగ
ననున్ । నీరజదళనేత్రుండగు । నారాయణు మదిని నేను ♦ నమ్మి
భజింతున్.

నా|| మాట. ఇప్పుడైనను తెలియలేదటరా.

ద్వా|| తెలసె, తెలిసె. మా పాదపద్మములకు పదివేల వందనంబులు స్వామీ.

నా|| ఛీ భ్రష్టా! తారుమారుగా గూయుచున్నావు నిన్నిప్పుడు శపించి వేతు జూడుమురా.

ద్వా|| అయితే యేమిసెలవిస్తారు మహానుభావా!

నా|| మాట. రాజుగారి యొద్దకుబోయి నేను వచ్చియున్నానని జెప్పుమురా!

ద్వా|| అలాగే జెప్పెదనుస్వామీ.

ద్వా|| దుర్యోధనమహారాజా పరాక్.

దు|| యేమిరా సమాచారము.

ద్వా|| నేనువచ్చియున్నానయాస్వామీ.

దు|| ఛీ! దుష్టా నిన్నెవ్వరు రమ్మనిరి? త్వరగా బోయి ద్వారమందు జాగ్రతగా నుండుము.

ద్వా|| ఛీ! ఛీ! లేచిపోవయాస్వామీ.

నా|| అదేమిరా నీవేమనిచెప్పితివి ఆతండేమని బల్కెనురా.

ద్వా|| నేను వచ్చియున్నానని జెప్ప ఛీ! లేచిపొమ్మన్నారయాస్వామి

నా|| అలా చెప్పవచ్చునటరా దుష్టా.

ద్వా|| ఇక యేలాగున చెప్పవలెనయా స్వామీ.

నా|| నారదముని వచ్చియున్నాడని చెప్పుమురా.

ద్వా॥ ఆలాగుననే చెప్పెదనుస్వామీ!

ద్వా॥ శత్రుగజ కంఠీరవా! పరాక్ దుర్యోధన మహారాజా! పరాక్!

దు॥ ఏమిరా సమాచారము,

ద్వా॥ యెవ్వరో దూడపలుపులవలె జడలుగలిగి ద్వారమందున్నారు, వానిపేరు నారదమునియట. తాను వచ్చియున్నానని మీతో మనవిచేయమన్నారు రాజా!

దు॥ ద్వారకా! వారు మహర్షులుగనుక వారిని రావద్దని యేమయిన ఆటంక పెట్టితివా.

ద్వా॥ నేనేమియు ననలేదు రాజశ్రేష్ఠా.

దు॥ త్వరగా జని వారినిచ్చటికి దోడ్కొనిరమ్ము.

ద్వా॥ అట్లే రాజశ్రేష్ఠా!

ద్వా॥ ఓనారదమునీంద్రా! మిమ్ము దోడ్కొనిరమ్మని ఆజ్ఞైనది. గాన త్వరగా దయచేయండిస్వామీ!

నా॥ మంచిది ఆలాగుననే వచ్చెదను. హరివాసుదేవ.

దు॥ మాట. ఓహో నారదమునీంద్రా! నాపైకూరిమిచే మీరిట కరుదెంచుటవలన నాగృహంబు పావనంబయ్యె; నేగృతార్థుండ నయితి ఈయుచితాసనమున గూర్చుండుడు.

నా॥ కం॥ క్షేమమె నీసతిసుతులకు। క్షేమమె నీబాంధవులకు♦క్షేమమె నీకున్ । క్షేమమె ధృతరాష్ట్రునకును । క్షేమమె నీరాజ్యమునకు ♦ జెప్పుమునాతో.

దు॥ తమకృపావశంబున మేమందరము క్షేమముగా నున్నవారము. మీరూరకేరారు. మీరిచ్చట కరుదెంచుట కారణం బేమో సెల వొసంగుడి మహాత్మా!

నా॥ నేను ద్వారకా పురంబునుండి నీకొక్కవార్త దెల్పుటకై యరు దెంచితి. నాపనికాదనక సేయవలయు కురుకులతిలకా!

దు॥ అదెట్లో సెలవిందుమహాశాస్త్రా!

నా॥ కం బలరాముని పుత్రికయగు । నెలవంకకు సాటిగాదు ♦ నెలతలు భువి యా । లలనామణి నీసుతునకు । సలలితముగ జేసుకొమ్ము ♦ సమ్మదమొదవన్.

నా॥ సీ. చక్కలబోలునా ♦ సుందరీమణిగోళ్లు । యరటి స్తంభంబులా♦యతివ యూరు । లాకాశసీకాశ ♦ మబల మధ్యంబెన్న । పొన్న పుష్పంబు యా♦పొలతినాభి । దాడిమ ఫలములా♦తరుణికుచంబులు శంఖంబు బోలునా ♦ సతిగళంబు।పంకేరుహంబులు ♦ బడతిలోచనములు । పున్నమచందురు ♦ బోలువదన । మహాహా! యటువంటి కాంతసీ ♦ యవనిలోన । సృష్టియెటుజేసెనో సుర । శ్రేష్టపురుని వానియిల్లిక బంగారు ♦ గానుయిట్టి । పనులుచేయుటచేగాదె ♦ బడసెకీర్తి.

నా॥ మాట. అట్టిరూప విద్యావిలాస సంపన్నురాలగు శశిరేఖను నీ కుమారునకు శీఘ్రముగా పరిణయంబు జేసుకొమ్మందుకు సందేహంబు నొందవలదు. "ఆలస్యాదమృతంవిషమ"మని పెద్దలు బల్కినందున త్వరగా వర్తమానంబు జేయుము. నేనుపోయివచ్చెద.

దు॥ మాట. చిత్తము ఋషిశ్రేష్టా!

నా॥ ఓహో దుర్యోధనా! మరచితి. మరచితి.

గీ॥ వాసుదేవుండు విష్వచ్చు ♦ పట్టికెవ్వ । డీసరోజాక్షినిప్పింప ♦ నెంచుమదిని । నీకిష్టంబు లేవటు ♦ సేయదైన । ద్వారవతుట మంచి పనిగాగు ♦ వలదుసుమ్ము.

నా॥ మాట వాసుదేవుం డీవనజాక్షి, నావాసవాత్మజపుత్రుని కిప్పింప మనంబునందెంచుచుండునది. యాహలాయుధున కిష్టంబు లేనట్లు సేయదైన ద్వరగా జాగుసేయక వర్తమానంబుజేయుట మంచిది. నేనుపోయివచ్చెద.

దు॥ మాట. ఆరేసేవకా! త్వరగా పౌరోహితులను బిలుపింపుము.

ద్వా॥ ఆలాగునే రాజోత్తమా.

దరువు - భైరవిరాగం - చాపుతాళం

విప్రవర్యు లరుగుదెంచిరీ వేడుకలువీరా॥ వి॥ విప్రవర్యులరుగు దెంచె। వేదపఠనముల్ జేయుచు। క్షిప్రగతి పంచాంగములు। జేతు లుబిగియుంగట్టి ॥వి॥ ఫలభాగంబునందున। భసితపుండ్రము। చాలా రంజిల్లుచుండగా। మేలగు స్ఫటికాక్షమాల మెరయువక్షమునను జేవుల నీలమణుల కుండలములు। నిగనిగమని మెరయుచుండ ॥వి॥ అరు దుగ యజ్ఞోపవీతముల్। యంసంబులందు। మెరయ గోపాలయను చును। ధరణిలోన గొల్వేపల్లి పురవరముని దలచుచు మది॥ పరగ శ్మృతతికి వేద। పారములను జెప్పుచు వడి ॥విప్ర॥

వి॥ మాట. దుర్యోధనమహారాజా! మమ్ముబిలువబంపిన కారణంబేమో యెరిగింపుము రాజా!

దు॥ మాట. ఓహో విప్రశ్రేష్ఠులారా! మీరు సరోజాక్షుని పుర వరంబునకుజని కామపాలునకు మాక్షేమ సమాచారంబులు దెల్పి మంగళద్రవ్యంబులొసంగి బలభద్రుని పుత్రికయగు శశిరే ఖను మన లక్షణునకు నడిగిరండు, పొండు.

వి॥ మాట. ఆహా! సంతోషమాలాగుననే పోయివచ్చెదము.

సం॥ ఇట్లు దుర్యోధను పురోహితులు ద్వారకా పురంబునకుజని ద్వారకునిగాంచి యిట్లనిరి,

వి॥ మాట. ద్వారకా! హస్తిపురాధీశుండగు దుర్యోధనుంపు బంప బ్రాహ్మణు లరుదెంచిరని బలభద్రున కెరిగింపుమురా.

ద్వా॥ చిత్తము విప్రశ్రేష్ఠులారా!

ద్వా॥ మాట. రేవతీ మనోరంజనా! జోహారు!

బ॥ యేమిరా సమాచారము.

ద్వా॥ మాట. యెవ్వరో బ్రాహ్మణులుదెంచి ద్వారమందున్నారు. వారు హస్తిపురాధీశుండగు దుర్యోధనుండు బంప నరుగుదెంచి రట! మీకెరుంగింపమన్నారు. రేవతీవల్లభా.

బ॥ మాట. త్వరగా వారినిచ్చటికి దోడ్కొనిరమ్ము ద్వారకా!

బ॥ మాట. విప్రవర్యులారా! నమస్కరింపుచున్నాను

బ్రా॥ సుఖీభవ సుఖీభవ సుఖీభవ.

బ॥ మాట. తమ రరుదెంచిన కారణంబేమో సెలవిండు మహాత్ములారా!

బ్రా॥ కం. కరిపురనాథుని తనయున । కురుగుణ శశిరేఖ నడుగ ♦ నుల్లాసముతో । నరుదెంచితి మేమిచటికి । గరుణాకర సెలవొసంగు ♦ ఘనగుణధామా.

మాట తనపుత్రుండగు లక్షణునకు మీపుత్రి నడుగుటకై కరిపుర నాథుండు బంప నరుదెంచితి మిందులకు తమ యభిప్రాయంబెఱింగింపుము బలభద్రా.

బ॥ మాట. ఆహా! యేమేమి? రారాజగు దుర్యోధనుండు బంపెనా మంచిది. మీకు సందేహంబేల.

బ॥ కం. ఘనుడగు లక్షణునకు నే । మనసమలరగ పుత్రినిచ్చి ♦ మక్కువ తోడం । ఘనముగ బెండ్లియొనర్చెద । గనుగొనగా మిమ్ము నాకు ♦ గౌతుకమాయెన్.

బ॥ కం. మతిమంతులైన పౌరో । హితులార! మహాత్ము ♦ లార! యీ । శశిరేఖాసతి లక్షణునకును ప్రబు । ద్ధత గన్గొనరయ్య చంద్ర ♦ తారాబలముల్.

బ॥ మాట. విప్రవర్యులార! లక్షణునకు నాపుత్రినిచ్చి నిశ్చయంబుగ పరిణయంబు జేసెదగాన చంద్రతారాబలంబులు చక్కగా నాలోచించి లగ్ననిశ్చయంబు జేయుడు.

బా॥ ఆలాగుననే ఆలోచించెదము బలభద్రా.

(విచారించి) బలభద్రా! యాలోచించితిమి. చంద్రతారాబలం బులు బహుచక్కగా నున్నవి. నేటి కెనిమిదవ వాసరంబగు దశమి లగ్నంబు బహుచక్కగానున్నది గాన నదే నిశ్చయము జేయుము.

బ॥ మాట. మంచిది. అదేనిశ్చయంబుజేసెద విప్రవర్యులారా!

బ॥ మాట. ఒరే ద్వారకా! త్వరగా జని పురం బలంకారంబు గావించి శశిరేఖాపరిణయవృత్తాంతంబు సాటింపబంపుమురా.

ద్వా॥ మంచిది! యాలాగునే జేసెద.

చారులు పురంబున శశిరేఖాపరిణయ వృత్తాంతము సాటించుట.

చారులు. ఓహూ పురజనులారా! మీరందరు వినందగు నేటి కెనిమిదవ వాసరంబగు దశమి లగ్నంబున బలభద్రుని పుత్రికయగు శశిరేఖను సుయోధనపుత్రుండగు లక్షణునకిచ్చి పరిణయంబుజేయు నోహూ.

స॥ ఇట్లున్న సమయంబున యీవర్తమానంబు చెలులచే విని సుభద్రాదేవి సితాంత చింతాక్రాంతస్వాంతయై కృష్ణునింగాంచి యిట్లనియె.

సు॥ కం. దండము నందకుమారక। దండము సుత్రామ వినుత ♦ దానవహరణా । దండము ముకుంద వరదా । దండము భక్తార్తి హరణ ♦ దండము కృష్ణా.

సు॥ మాట. అన్నయ్యా నమస్కరింపుచున్నాను. కృష్ణా! నమస్కరింపుచున్నాను.

కృ॥ మాట, ఇట్లు ఖిన్నురాలవై వచ్చుటకు కారణంబేమమ్మా సుభద్రా॥

సు॥ అన్నయ్యా నేనేమిజెప్పుదు,

దరువు - పూరికల్యాణిరాగం - రూపకతాళం

యెంతమోసమాయె నా । కేమియు మదిదోచదాయె । చెంత జేరి వేడితి మును । దంతివరద । కంతుజనక॥ యెం॥ నీటికెదురు నీదు

వారితోఁటి సాటియయ్యె బ్రతుకు । నాటిమాటలెల్ల దలఁప । నీటిమూట లాయె॥ నేడెం॥ పన్నగారివాహన నీ । కన్నా దిక్కెవ్వరు। మన్ననతో బ్రోవుమింక । సన్నుతింతునన్నా నా॥ కెం॥ వాసిగాను గోల్లేపల్లి । వాసుడనన్ దగిన నిన్ను । దోసిలొగ్గి వేడితి నను । గాసిమాన్పిబ్రోవుమయ్య ॥యెంత॥

కృ॥ మాట యేమేమి సుభద్రా?

సు॥ మాట, అన్నయ్యా నేనేమిజెప్పుదు. బలరాముండు నీతోఁటిపల్కిన నాటిమాటలెల్ల దలంప నీటిమూటలాయెగదా! నేనేమి సేయుదు! ఇందురేఖను దుర్యోధన పుత్రునికిచ్చెదనని మాటయిచ్చెనట! యిట్లాడితప్పుట దగునె యన్నయ్యా!

కృ॥ మాట. యేమేమి! యేమేమి! బలభద్రుం డిందురేఖను దుర్యోధన పుత్రునకిత్తునని మాటయిచ్చెనా? యేమీచిత్రము! అట్లయినబోయి యడుగుదము రమ్ము లెమ్మ.

దర్వు - కమాచిరాగం - ఆదితాళం

కేశవుండు వెడలె । సీరపాణివిడిదికి ॥కే॥ భాసురముగ బలభద్రులపుత్రిక । వాసనిసుతునకు జేసెదననుచు ॥కే॥ కరకంకణములు మ్రోయగా । కౌస్తుభమణి యురము నందున మెరయగా । గురుభుజముల భుజకీర్తులు మెరయగ। సరవి వ్రేళ్ళనుంగరములు మెరయగ॥కే॥ నల్లనిదేహమందున । ద్వాదశోర్ధ్వపుండ్రము । లెల్ల రంజిల్లుచుండగా । మెల్లమెల్లన సుభద్ర తనవెనుక । నుల్లమందు చింతిల్లుచు నడువగ॥కే॥ పురజనములువొగడగా । రత్నమకుటకిరీటము । శిరమునందున, మెరయగా । పరగ గోల్లేపల్పురమున వెలసిన । సరసిజాక్షుడతిసమ్మోదంబున ॥కే॥

సం॥ ఇట్లు శ్రీకృష్ణుండు సుభద్రాసమేతుండై వెడలి బలభద్రుమందిరమునకున్ బోయి యాతనిన్ గాంచి యిట్లనియె.

కృ॥క॥ అన్నా చెల్లెలపట్టికిఁ గన్నియనిచ్చెదనటంచు ఘనముగదెల్పం
విన్నారందరు దప్పక । కన్నన పార్థునకొసంగు కరుణదలిర్పన్॥

కృ॥ మా. అన్నా నీకీసన్నాహంబు ధర్మమే దుర్యోధనునికుమారునికి చెల్లెల పట్టికిత్తునని తెల్పి యిప్పు డిటుకన్యనిచ్చేదము జెలునే శశిరేఖ



బ॥ మా. యేమేమి కృష్ణా?

గీ. పంకజాతాక్ష జూడుమీ ♦ పాండుపుత్రు । లరయచుట్టంబులైన నీ ♦ యడవిలోన । కౌరవులు నట్టి చుట్టాలు ♦ గారెదలప । పక్షపాతంబు నీకేల ♦ పద్మనాభ!

బ॥ మా మనకు పాండవు లత్యంత బంధువులయిన కౌరవులుమాత్రి నట్టి చుట్టాలుగారు? నీకింత పక్షపాతంబేల మాధవా!

కృ॥ మా. యేమేమి బలభద్రా!

సంవాదం దరువు - కాంభోజిరాగము - అటతాళము

కృ॥ యెందుకు యీలాటి దుర్వాదము ॥యెం॥ యిందు కేమనుకుందురో యని సందియము మది జెందవైతివి ॥కెందుకు॥

బ॥ దనుజహరణా డగునే నీవిటులాడ । ధనవిహీనుండైన కర్ణాడితన యునకు నా తనయనిత్తునే ॥దనుజ॥

కృ॥ ముందుగా జనులందరువినగ యీయిందు రేఖను నిత్తుననుచుబలికి మందబుద్ధినియిప్పుడునీ వీ చందమున బల్కుండగునే ॥యెం॥

బ॥ వాదమేటికి వారిజదళనేత్ర నాదుపుత్రిని నరసుతునకునివ్వ మోదమున యీకౌరవేంద్రుని ముద్దులకుమారునకు నిచ్చెద ॥దను॥

క॥ యేటికీ యీలాటిమాటలువిన్న సాటివారలు సంతసింతురే నాటిమాటతెల్లను దలపనేడిటు బూటకంబులు జేసితివిభళి ॥యెం॥

బ॥ యిట్టిమాటలింకేటికిచాలించు యెట్టిమతివిహీనుండైన తనపట్టిధన హీనునకునిచ్చునె యిట్టి వెర్రిప్రసంగమేలను ॥దనుజ॥

కృ॥ అరయగ మేనల్లుడుండగ పుత్రిపరులకిచ్చుట భావ్యముగాదని పరగ పెద్దలు బల్కరేమును బాలికను నొరులకీదగునే ॥యెం॥

బ॥ ధరణి గోత్రపల్పురమున వెలసిన । సరసిజాక్షా నా పత్రపుత్రికను నే కరిపురేంద్రుని సుతునకిచ్చెద నరసుతున కివ్వంగజాలను ॥ దను॥

కృ॥ వచ. భగలోమేనల్లుండుండ పరులకు పుత్రినిచ్చుట భావ్యంబు కాదని పెద్దలువచింతురుగాన యీసన్నాహంబుమాని సౌభద్రునకుఁ గన్యాదానంబుజేయుముబలభద్రా!

బ॥ గీ॥ ఇష్టమృష్టాన్నములనుసం ♦ తుష్టి జెంది! చల్దికూడునపేక్షించు ♦ చందమరయ । కౌరవేంద్రునిచుట్టరి ♦ కంబుగల్గ । పార్థువియ్యంబు గోరుట పంకజాక్ష.

బ॥ వచ. ఇష్టమృష్టాన్నంబులచే సంతుష్టిఁ జెందినమానవుఁడు చల్దికూడునపేక్షించు లెటులో పార్థునివియ్యంబుగోరుటట్లగు.

కృ॥గీ॥ కరివరంబును దూషించి♦ఖరముగాంచి। మంచిదంచునుమదిలోన♦ నెంచినట్లు । కవ్వడినిదూరి నేశిట్లు ♦ కరిపురేంద్రు।వినుతి సేయంగ నేలను ♦ వెఱ్ఱి వగుచు.

బ॥ యేమేమి కృష్ణా!

సంవాదం దరువు - కాంభోజిరాగం - ఆదితాళం

బ॥ యేర నీవిటు బల్కనేటికిరా చాల్చాలునింక॥ యే॥ సారాసాక్షనీవు మది సందేహ మేమియులేక యీరీతి బల్కెదవు నీవేటికి నాతో రారాజుని గాగాబు కుమారునకు నాపుత్రినిచ్చి ధారుణిబెండ్లి జేతు నరుతనయునకిత్తునే భళి ॥యే॥

కృ॥ యేలనిటులాడ నేలనురా; మేల్ మేలు భళిభళి॥యే॥ యేఁరనీలాంబర నీ వీలాటి మాటలాడుట మేలటర నీకు యీ మేదినిమున్ను శూలిగెల్చిన పార్థసూనుని కివ్వక నీవేలా దుర్యోధనసుతున కిచ్చెదనని యెదవు భళి ॥యే॥

బ॥ ఉన్నవారన్నములేక ఖిన్నులై వనములనుండ । కన్నియనిమ్మని బల్క । గాను ధర్మమే । వెన్నవిడిచి ప్రీతిగ । సున్నము దినగోరి నట్లు । అన్నము లేనివారికి । కన్నియనిత్తురె భళీ ॥యే॥

కృ॥ చిన్ననాటనుంచి నీవు । చెల్లెలపుత్రునకు నీ । కన్నియనిచ్చెదనంచు । గారవించి నే । డిన్నిమాటలాడుచు నీ। కన్నను దుర్యో

ధనుని । చిన్నిపుత్రునకు బెడ్డి । జేతునంచు బల్కెదగునే॥ యేల
నీవిటు లాడ నేటికిరా॥

చ॥ ధరణి గొల్లపల్లి పురవరదా నివిట్టు లాడుట పరువుగాదు పొమ్మ
యింక । పంకజాతాక్షా । పరగ పాండవు లత్యంతబంధువులైనను
గానీ । నరసిచూడగా కౌరవులట్టివారుగారె నీకు ॥యే॥

కం. కురురాజతనయునకు మద్వరపుత్రిక నిచ్చి మిగుల ♦ వాత్సల్య
మునన్ । బరిణయ మొనరించెదనే । నరవుతురిన కివ్వజాల ♦నలిన
దళేక్షా.

కృష్ణా! నీవెందుకిట్లు బల్కెదవు? రాజ్యవైభవ యుక్తుండగు రారాజ
పుత్రునకు గాక రాజ్యవైభవహీనుండగు నర్జునుపుత్రునకేలనీనగు.

కృ॥ భళభళా యేమేమి యేమేమి బలభద్రా!

సీ. ధర్మాత్ములగు పాండు ♦ తనయుల మదిలోన ధనహీనులంచును ♦
దలచినట్లు దూషించి నేడు యా♦కురోధ్యనాదుల । నమితవైభవ
యుక్తు♦లనితలంచి । భూషించెదవు నీవు ♦ పుత్రిక నెచ్చోటయిన
నిష్టపూర్వకముగ నిచ్చుకొనుము। యధికశౌర్యోపేతు♦ లంచితగుణ
వంతు లమితపరాక్రము। లధికబలులు। నస్త్ర విద్యాధురీణులు ♦
నై చెలంగు । వడిమడియు పార్థులేకమై ♦ వచ్చివారు । కదనభూ
మిని మిమ్ముల ♦ గదిసినపుడు । కౌరవులునీవు పడుపాట్లు ♦ గాం
త్రుగాక!

కృ॥ మాట. సుభద్రా! నీకుదిక్కుంగల వోటి కరుగుము. నేనుపోయి
వచ్చెదను.

సంవాదం - దరువు - కాఫీ - ఆదితాళం

సు॥ అన్నా హలాయుధ । విన్నపమాలించి నా। చిన్నికుమారునకు। కన్నె
నొసంగర ॥అ॥

బ॥ వెలదినీ కెందుకీ । వైరిప్రసంగము । వలదు చాల్ చాలునిక ।
వగపేల మానుము ॥ వె॥

సు|| అన్నానీకన్ననా | కన్న దిక్కెవ్వరింక | సన్నుతిపాత్రి నీకు |
సాగిలిమ్రొక్కెదర ||య||

బ|| భాగ్యవిహీనులకు | వడతులనిత్తురే ని | ర్భాగ్యురాలా! యిటు|
బల్కగనేటికే ||వె||

సు|| వేడుకమీార మీాతో | వియ్యమందుటకు | వేడుకొనుచుంటి న |
న్నేరు సేయకుమింక ||య||

బ|| పరగ దుర్యోధను| బంధుత్వమబ్బెనా | వరపుత్రికనునీ కొ| మరున
కివ్వగజాల ||వెల||

సు|| అందరువిన మును | యభిమన్యు కిత్తునని| ముందుగబల్కియిటు|
మోసపుచ్చుటమేలా ||య||

బ|| మగువా నీవిట్టుల | మాట్లాడ నేటికి | తగవేల నాతోడ | తగదు
పోపొమ్మిక ||వెల||

సు|| నమ్మియుండితినిటు | నాటనుండియు కతి | నమ్మలైనమాటల |
సొమ్ముశి ంజేసెద ||వన్నా||

బ|| ధరణి గోత్రేపల్లి | పురవరుసాక్షిగ | కురురాజసుతునకు | నా |
వరపుత్రినిచ్చెద || వెలది నీకెందుకే||

సు|| మాట. అన్నా బలరామా!

సు|| కం. పెంచితిరి పెద్దజేసితి | రంచితముగ కరుణతోడ ♦ నతులిత
కీర్తిన్ | మించితిరి నేటికినను | వంచనగా మీారిబల్క ♦ వచ్చునె
జెపుమా.

సు|| మాట. అన్నయ్యా! యెన్నరానికరుణవలన నాపన్నుల నాదరిం
పుచు వన్నెకెక్కియున్న మీారిన్ని దినంబులు నన్నుమన్ననగావించి
పెంచి నేటి కిట్లు ధర్మవిహీనంబులగు దుర్నయపు మాటలాడుట
దగునా?

బ|| యేమేమి సుభద్రా!

బ॥గీ॥ నవ్వులకు బల్కు-మాటలు ♦ నాతినీవు | నిశ్చయము జేసి బల్కు-ట ♦ నీతియగున | భాగ్యహీనులకిత్తురే ♦ పద్మముఖుల | సారె సారెకు పెక్కు-లు చదువనేల.

బ॥ మాట. యేమేమి సుభద్రా! నే నవ్వులకాడినమాటలు నిశ్చయంబుజేసి నిన్నెవ్వరుబుత్తెంచిరో దెల్పుము లోకమందెవ్వరయిన నను భాగ్యహీనులకు పడతుల నొసంగుదురే యిట్టి వెర్రివ్రిసంగం జేల? చాల్చాలు పొమ్మా.

సు॥ అన్నా !

సు॥గీ. కలిమి గలవారికెవరైన ♦ కన్యనిచ్చి | పెండ్లిజేతురు వినుమయ్య ♦ పెక్కు-లేల | ధనము నిరుపేదకిచ్చుట ♦ ధర్మ మరయ | గాన సాధమ్రినకునిమ్ము ♦ కమలముఖిని.

సు॥ అన్నయ్యా !

గీ. విపినములనున్న పితరుల ♦ విడచిపెట్టి | నట్టిసాధమ్రినకు నాదు ♦ పట్టినిచ్చి | గట్టిగా పెండ్లిజేతు న ♦ న్నట్టిమాట | గట్టిపెట్టితి విది నీకు ♦ రట్టుగాదె

సు॥ మాట. అన్నా బలరామా! మున్నెల్లవారలువిన పల్లవాధరి నిత్తునని నాయుల్లము రంజిల్ల జేసినట్టి కతలెల్ల గల్లలని బల్కు-జెల్లునే.

బ॥ యేమేమి సుభద్రా!

దర్వు - సావేరీరాగం - ఆదితాళం

యెందుకీటుల పేర్లెదవు | సందియంబు లేకను ॥యెం॥ ముందందిన బంధుత్వము చాలిపు | డిందు రేఖవివ్వజాలపోపొ ॥యెం॥ కూడుగుడ్డయులేక నా | కొంపజేరిన | కూడుగుడ్డనేనిచ్చిన | కోడలిపుడు గానలయునటంచును | గోరెదవు చాలుచాలుపొమ్మికా॥ యెం॥ కురురాజు కెందరయ్యనను | సరిగారీవసుధ | పురుహూతసము జెంచగా | ధరగోత్వేపల్పురవరుసాక్షిగ|కరిపురమే సురపురంబనందగు ॥నెందు॥

బ॥ మాట. నే తగ్గితగ్గియున్న నెంతో బెగ్గడిల్లుచూ దగ్గిరకువచ్చెదవు నీకిగ్గతు లెవ్వరుగ్గడించిరో దెల్పుము సుభద్రా!

సు॥ మాట. అన్నా బలభద్రా నేనేమిజెప్పుదు.

సు॥ కం. ధర్మాత్ముడవగు నీకీ । దుర్మార్గపు బుద్ధియెట్లు ♦ దోచెను భువి నా । కర్మము గాబోలును యిటు । ధర్మవిహీనముగబల్క ♦ దగునే నీకున్.

సు॥ సీ. ధరను నృపతులు సత్యంబు ♦ దప్పిరేని । జనులికందరు వారీతి ♦ సంచరింతురు । సత్యమునకెల్ల ధర్మముల్ ♦ సాటిరావు। సత్యమే నిత్యమని శ్రుతుల్ ♦ జాటవినవె

సు॥ మాట. సకలధర్మస్వరూపులగు తమతోడ నేనొక్క విన్నపంబొనర్చెద. సావధానంబుగా నాకర్ణించి చిత్తంబుకొలది నవధరింపం దగు నదెట్లంటేని? అనృతంబునకంటె మించినపాతకంబును, సత్యంబులకు సరియగు పుణ్యంబును లేదని శ్రుతి, స్మృతిపురాణేతిహాసంబులన్ పలుకుచుండు. వాపీకూప తటాకప్రతిష్ఠ సప్తసంతానంబులును సత్యవాక్యంబుతోడ సమానంబునొందనేరవు. సకల జనంబులు సత్యాసత్యజన్యంబులగు పుణ్యాపాపంబులచే స్వర్గనరకప్రాప్తులయి సుఖదుఃఖంబు లనుభవించుచుందు రట్టి సత్యంబు నైహికాముష్మిక సౌఖ్యంబులకు ముఖ్యకారణంబుగాన సత్యమే నిత్యమైయుండును. సత్యంబున కెల్లధర్మంబులు సాటిరావుగాన సత్యంబుదప్పక నాడగ సౌభద్రునకు కన్యాదానంబు జేయుమన్నా బలభద్రా.

బ॥ మాట. భళా! భళా! యేమేమి! యేమేమి !!

దరువు-ఆరాణారాగం-రూపకం.

యిటులబల్కదగునే నేడీసభలో నాతోడను ॥ యి ॥యిటులవల్కజెల్లునే యూరా । యిందుముఖిని నీసుతునకు । నిటలాక్షుడుజెప్పినను।నిజముగ నేనివ్వజాల ॥యిం॥ ఉన్నవారరణ్యంబుల ఖిన్నులై యుండగ నపుడు । కన్నియ నిమ్మనుచు నీవు । గలువరించ ఫలమేమి॥ యిటు॥ భయములేక యీరీతిని। భాషించెదవిందరిలో నయపథములు దెల్పభువిని ।నాతులకున్ దగునే భళి ॥యిటు॥ధరణిలోన గొల్లపల్లె

పురవరదుని సాక్షిగాను । కరిపురేంద్రుసుతునకు నా । వరపుత్రిక నిచ్చెదభళి ॥ యిటుబల్కదగునే ॥

బ॥ ద్వి ॥సారెసారెకు పెక్కుచదువుల చదివి ॥ నేరుపులోక కొన్ని నేర్చవచ్చితివె । భయము వోనాడుచు భాషించెదిట్లు । నయ మార్గములుదెల్ప । నాతికిదగునే । యీసభనున్నట్టి । యెల్లవారలకు। నీసరసత్వంబు నేటితో దెలసె । అన్యాయమునెద వీవతిపెదలకును । కన్యనొసంగుటకంటె నన్యాయ । మరసిజూడంగ నెందయిననుగలదె । ధరణి నీవిట్లాడ దగదువేవేగ।బోపొమ్ము నీనేర్పు పొసగ దిచ్చోట। వాపోవ నేటికి వచ్చిన త్రోవ॥

సెభాస్! భళా! భళా!! నీయసంగత ప్రసంగంబులు చాల్చాలు పో పొమ్మ.

సు॥ మాట. అన్నా బలభద్రా.

సు॥ కం సత్యము విడనాడక నీ । వత్యాదరలీల నన్నె ♦ దాత్మ జానకి నొ । న్నత్యమతి నీకు ప్రియసుత । నత్యుత్సాహమున నొసగు ♦ టర్హముగాదే.

సు॥ మాట. అన్నయ్యా గోటజిమ్మోటిపనికి నొడ్డలి బూనుభంగి నావంటి బోటికై లేనిపోని దాటిబూనుట మేలా.

బ॥ మాట. యేమీ సుభద్రా యిట్టి వెర్రిప్రసంగంబులేల జేసెదవు చాల్చాలు పో పొమ్మ.

సు॥ మాట. యెంతకఠినహృదయమాయెరా?

సుభద్రా, బలరామ సంవాదం, దరు, హిందూస్తాని-ఆదితాళం.

సు॥ యేమిసేతు మనవివినుము, యెవరునాకు దిక్కిక ॥ నే ॥ తామసింపనేల నాదు సుతునకు నీ । కోమలాంగి నిమ్ము ॥ యే ॥

బ॥ చాన నీసుతునకివ్వనే చాలుచాలు పొమ్ము । దీనురాల వగుచు నుండనేమిటికే । మానిని యికపొమ్ము ॥ చాననీసు ॥

సు॥ యెల్లజనులు వినగ నిత్తునని యిపుడీ । కల్లనాడజెల్లునే ॥యేమి॥

బ॥ ధనములేనివారికి భువినెన్నరైన । తనయనిచ్చిజేతురే ॥చాన॥

సు॥ పరగ గొల్వేపల్లి పురినివెలసిన శ్రీ । ధరునిమాటవినవిక ॥యే॥

బ॥ కం రారాజుని గారాబుకు । యూరున కిచ్చెదను నా కు♦మారికను మహాశా । దారముగ నీవు వచ్చిన । దారిని విచ్చేయుమింక ♦ దగదు వచింపఁగ.

బ॥ మాట. సుభద్రా నీవు యిచ్చోటనుండ నేల? వచ్చినదారిని చెచ్చెర విచ్చేయుము.

సు॥ గీ. బిబ్బులను గోరి । యిట్టుల ♦ బ్బిబ్బులాడి । కౌరవులుమీకు నేకమై ♦ గహనములకు । మమ్ముబంపి మదీయ రా♦జ్యమ్ముమీర । లేలుకొనుడింక పుడమిని ♦ మేలుగనుడు॥

సు॥ మా కౌరవులును మీకును ఏకమై మమ్మరణ్యంబులకుఁ బంపి మీరే రాజ్యంబునేలుకొనుడు, నేనుబోయివచ్చెద.

సం॥ ఇట్లు సుభద్ర నిష్ఠురంబులాడి యేడ్చుచూ బోవుచుండ నంత సాత్యకి బలభద్రునిఁ గాంచి యిట్లనియె.

సా॥ మా. యేమేమి, యేమేమి బలభద్రా!

సా॥ గీ. ధర్మజాదుల దూషించి ♦ దుర్మదమున । ఘనుడు దుర్యోధనుం డని ♦ వినుతిజేసి । వదరుచుంటివి పీకులు ♦ పాండుసుతులు । కౌరవులబట్టి ఖండించు ♦ కయ్యమందు.

సా॥ మా. అరే! యసత్యప్రలాపీ! సత్యాత్ములదూషింపుచు దుష్టాత్ముల భూషించుచున్న నీనాలుక వాలికలై పోకుండుట చిత్రమేమిరా? ధర్మపదంబుదప్పక ధరణీతలంబెల్ల పరిపాలింపనున్న పాండుపుత్రులు కౌరవులంబట్టి కయ్యంబున బడగొట్టి జముపురంబు జేర్చుట నిశ్చయంబుసుమా.

సం॥ ఇట్లుబలుకుచున్న సాత్యకివాక్యంబులు బెడచెవులఁ బెట్టి విప్రవర్యులఁ గాంచి యిట్లనియె.

ఎ॥ మాట. ఓహో విప్రశ్రేష్ఠులారా !

బ॥ గీ. బంధుసమితితోడ ♦ భాసురరీతి నా । దశమిలగ్నమునకు దర్లిరండ । టంచుదెల్పిరండు ♦ యా సుయోధనునకు । క్షిప్రగతిని సేగి ♦ విప్రులార.

బ॥ మాట. త్వరగా జని దశమిముహూర్తంబులకున్ దోడ్కొనిరండు పొండు విప్రులార.

బా॥ మాట. మంచిది: ఆలాగుననే పోయివచ్చెదము బలభద్రా.

సు॥ మాట. ఆహా బలభద్రుండింత క్రౌర్యంబుబూనుట దెలియ దాయెగదా! నింక నేనేమిసేయు దెట్టివారికైన దైవకృత్యం బనివార్యంబుగదా.

సం॥ ఇట్లు సుభద్ర శయ్యాతలంబు జేరి చింతించుచున్నంత సూర్యాస్తమయంబగుటయు నభిమన్యుండు తోడిబాలురతోడి నాడుకొని మందిరంబునకున్ వచ్చి చింతాకులచిత్తయై శయ్యాతలంబుజేరి యున్నతల్లింగాంచి యిట్లనియె.

అ॥ మాట. తల్లీ యిట్లు చింతించుటకు కారణంబేమమ్మా!

దర్వు - దేశీయతోడి-రాగం-ఆదితాళము.

ఇటుల చింతించదగునే । ఏమీ యీవింత॥ఇటు॥ పటుబల వంతులు। పాండుసూనులుండగ । కటకట బడనేల । కరుణించిదెల్పవె॥ యి॥ వనమునన్న మా।జనకులవార్తలు । వినబడినదా చక।వివరించి దెల్పవె॥యి॥ధరణినోల్వేపల్లి । పురమునవెలయు శ్రీ । ధరుని సాక్షిగ నాకు।దగదెల్పవమ్మా జననీ ॥ఇటు॥

అ॥ మాట. ఇట్లు శయ్యాతలంబు జేరి చింతించుటకు కారణంబేమమ్మా తల్లీ.

సు॥ మాట. కుమారా నేనేమి జెప్పుదు.

దర్వు-వసంతరాగం-రూపకం.

యేమిసేతుపుత్రా నే। నేమనివివరింతునీకు। భూమిలో నాదైన్యముదుపు। పుణ్యాత్ములుగానరారు ॥ యే ॥అలదుర్యోధనసుతునకు।

బలరాముడుపుత్రినిచ్చి। ఇల పెండిలిజేతునంచుబలికె నికేహనిబల్కుడు ||నే|| కురురాజుకుయెందరయ్యు। ధరణిలోన। సరిగారని। వరగ స్తోత్రములుజేయుచు। పాండుసుతులనిందజేసె || యే || జగతివెలయు గోల్వేపల్లి। ఖగవాహనుడు పలురీతుల। దగదని దెల్పినను నన్ను తథ్యము ఛీ పొమ్మనియె||యే||

సు|| మాట. కుమారా నేనేమనిజెప్పను? దుర్యోధనపుత్రున కిందు రేఖనిత్తుననుచు నేటి కష్టమదివసంబగు దశమియందు లగ్నంబు నిశ్చయించి విప్రవర్యులంబంపె ఇంక నేనేమి సేయుదు.

అ|| మాట. యేమేమి!యేమేమి!! తల్లీ! భళా!భళా!మంచిది కానిమ్ము.

అ||ద్వి|| ఇది యద్భుతంబాయె నిందీవరాక్షి। మదమునబల్కె-నేమా ధవాగ్రజుడు। చిగురుబోడినినాకు జేయనివాడె। యగుగాక క్రొవ్వి తానటులాడనేల। తరిమైన వేళను దగశత్రువులను। బరిమార్చ కున్న యీ బాణంబు లకట। పోరిపోరిగాల్చనే భూమండలమున। హరి సాత్యకులదప్ప సందరికూల్తు। గాన నేనిప్పుడే కడుపడినేగి। వానిక్రొవ్వడలించి వచ్చెదనమ్మ.

అ|| మాట. తల్లీ! నావంటి సుతుండుండ నీవిట్లుల చింతించెదవా. శశి రేఖను నాకొసంగకుండుటయే మేలు.........మంచిది.

అ|| గీ. చక్రధరుడును సాత్యకి ♦ సంతసమున। జూచుచుండంగ జన ములు ♦ చోద్యమంద। కామపాలునిబట్టి నే ♦ గయ్యమందు। గం డడంచెద జూడుము ♦ కడుముదమున.

మాట ఈ పదునుగలశరంబులచే బలరామునిమదంబడంచెదజూడుము తల్లీ!

సు|| మాట. కుమారా! ఇట్లుదేశమేల? హలాయుధుండాడుమాటలు వినిపోయి లేనిపోనివి కొన్నిదెల్పి కుమారున కత్యంత వైరంబు కలుగజేసిన గయ్యాళియని బలుకుదు రిట్టి యపవాదంబేల? యుద్రేక ముడుగుము.

అ|| మాట. యేమేమి? యేమేమి? తల్లీ!

క౦ వెయ్యేటికి జెప్పెద విను । కుయ్యో మొఱ్ఱోయటంచు ♦ కు
య్యేడ నిపుడే । గయ్యమున కౌరవుల నేజయ్యనబంపెదనుజూడు జముపురమునకుఁ.

అభిమన్యుడు, దరువు, శంకరాభరణరాగం-రూపకతాళం.

వలదు యిటుల బల్కుట యా । వాద మేల చాలించుము॥వ॥
కలకాలంబాకరీతిని । గడువదెట్టి వారికైన । అలహరిశ్చంద్రుడు కడు
నిడు । ములబడిపడి పరులయిండ్ల । మునుయుండడె వారలు యా ।
బలునివలెఁ తుచ్ఛపుకూ । తలు గూసితివెల్లి యిక ॥ వల ॥ నిలువ
జాల నిచ్చోటను । నిముసమైనగాని నేను । జలజనేత్రి సెలవొసంగు
బలరాముండాడినట్టి । పలుకులెల్ల నాచెవులకు।ములుకులుగానాటెను।
యా ముసలాయుధు దుంచెద భళి ॥వ॥ అర్జునుండొసగువిద్య । నతి
నిపుణతతోడ నేను । నిర్జరులు నుతింపగ యా । దుర్జనులగుకౌరవు
లను । దురిములోన బట్టికట్టి । నిర్జింపక నిలువలేను । నీరజముఖి
యిపుడేగద ॥వ॥ ధరణిలోన గొల్లపల్లి । పురవరమున వెలసినట్టి।కరి
వరదునిసాక్షిగాను । కరిపురనాధుని బలునిఁ । శిరములు ఖండించి
నేడు । స్థిరముగ జముపట్నమునకు । జేర్చెద నికజూడుముభళి ॥వల॥

అ॥ తల్లీ! గీ. దైవగతిదప్పి నలుడు జూదముననోడి । పరులయిండ్లను
యుండడే ♦ భావమలర । వార లీరీతిదిట్టిరే ♦ వారిజాక్షి । బలుడు
నేడిట్లు గూసెను ♦ భయములేక.

అ॥ మాట. తొల్లి నలచక్రవర్తి మొదలగువారెందరు పరులగేహం
హంబులందుండరె? అట్టివారందరు యిట్లితుచ్ఛపుకూతలు గూసిరే
తల్లీ!

సుభద్రదరువు-ముఖారిరాగం. ఏకతాళం.

తగదురా యింత । తామసము నీకు । దగునే యా బలభద్రు
తోడను । బగవహింపుట పుత్రికా ॥తగదు॥ జలజభవువాత్రిత । ఫల
మిటులుండగా।బలునిజంపెద ననుచు నీవిటు। బలుకగా ఫలమేమిరా॥త॥

బలరాముని నీవు । చలముచే దునిమించిన ఇలను గొల్లేపల్లి పురమున వెలయు శ్రీధరు డలుగడా ॥తగదు॥

సు॥ మాట. కుమారా! యాబలభద్రుండు పలువిధంబుల కఠినవాక్యంబులాడుట కాలవిశేషంబునన్ గత్తె యిప్పుడా కామపాలునిపై కత్తిగట్టనేలా?

అ॥ యేమేమి?

అ॥ ఉ. ఇప్పుడుదల్లి యిట్లు పచియించెద వేలనరోషహీనవై।యిప్పని సేయుబోదునన ♦ నిష్ట సుఖింతయు లేకయున్న యీ । తప్పుడు కూతలం బడుచు ♦ దప్పక యుప్పరమందుయుందుమే । నిప్పుడె గానసంబులకు ♦ నేగద పాండవులుండు చోటకున్.

అ॥ మాట. తల్లీ!యిప్పనికినీకు మెప్పు లేకున్న యీతప్పుడుకూతలకోర్చుచు యిప్పరంబునసే యుండుము. నేను మాతండ్రిగారున్న యరణ్యంబునకున్ బోయెద.

సు॥ మాట. నన్నువిడచిపోవధర్మమే నీవెంట నేవచ్చెదను కుమారా!

అ॥ మాట. తల్లీ! అట్లయిన త్వరగాలెమ్మా.

సంధి॥ ఇట్లభిమన్యుండు సుభద్రాగమనంబునకొడంబడి జనంబులు నిద్రింప నర్థరాత్రింబున తల్లిన్‌దోడ్కొని యరణ్యంబునకుఁబోవు చుండె నెట్లనిన.

దర్వు-శేగడరాగం. ఆదితాళము.

వెడలె సౌభద్రుడపుడు।వనభూములకు ॥వె॥ వెడలెనుసుభద్ర వెంటరాగదా । కనువడిశరములు। కరములగ్రాలగ ॥వె॥ నిండుకోపముతోడను । నిశీధిని । రెండుఝాముల వేళను । పుండరీక నయనుని తోడెల్పుక ।దండిజంతువులుండువనములకు ॥వె॥ పురజనులు జూడకుండగా। పెనుజీకటిని । త్వరగతిభీతిజెందక । ధర గొల్లేపల్పురిగోపాలుని । మరవక మదిలో । స్మరణజేయుచును ॥ వెడ॥

శ్లో॥ హరిణాపి హరేణాపి । బ్రహ్మణాపి సురైరపి । లలాటలిఖితా రేఖా । పరిమార్ష్టున్ నశక్యతే. అనుశాస్త్రరీతిగా నొసటవ్రాసిన

నాశ్రితదప్పింపహరిహరబ్రిహ్మాదులకునైన నశక్యంబుగదా!నాశ్రిత ఫలంబిట్లుండెగాబోలు నేనేమిసేయుదు.

సంధి॥ ఇట్లభిమన్యుండు చింతించుచుతల్లిగా దోడ్కొని గిరిగహ్వరంబులాలోకించుచు రెండుదినంబులు రేయింబగళ్లుం గడచి మూడవనాటి సాయంకాలంబునకు ఘటోత్కచుండుండు వనంబుజేరి యావనంబుగాంచి మనంబున వితర్కించుచుండె నెట్లనిన.

దరువు-మలయమారుతరాగం-ఆదితాళం.

ఘోరా యావనము । అతిచోద్యమయ్యె॥ నాకో॥ కారుపులులు మదకరులు సివంగులు । కారెనుబోతులు గంతులిడెను భళి ॥ ఘో ॥ నింబ పనస వటనీపకపిత్థము । లంబరంబునకు నంటుచు బెరిగెను॥ ఘో ॥ శరభకరిరిపులు । చమరీమృగములు । కిరిహరిచయములు । పరుగులిడెను భళీ ॥ఘో॥ సాలతాల తక్కోలరసాల త । మాలసాల హింతాలములు...ను ॥ఘో॥ ధరనుగోర్వ పల్పురవరుసాక్షిగ । సురలకైన యిది చొరశక్యముగా ॥ఘోరా॥

అ॥ మాట. ఆహా! యేమి తాలతక్కోలరసాల హింతాలాది భూజంబులును శరభశార్దూలాదిమృగంబులును గల్గి యావనంబతి భయంకరంబుగా నుండె......మంచిది.

సంధి. ఇట్లున్న సమయంబున సుభద్ర కుమారున్ గాంచియిట్లనియె.

సు॥ మాట. కుమారా! రెండుదినంబులనుంచీ యరణ్యంబుగడచినను మీతండ్రిలుండు నరణ్యంబునుగానమైతిమి. నాకు మార్గాయాసంబున దాహంబాదవె. శిలాకంటకంబులు దాకిపదంబులు దెమలింపగావాయె యింక నేనేమిసేయుదు యిచ్చటకొంత సేపునిద్రించెదను

అ॥ మాట తల్లీ! యెంతకష్టము సంభవించెను. ఈ సమీపంబుననున్న జలంబులుత్రావి యిచ్చట నిద్రించుము.

సు॥ మాట ఆలాగే కుమారా.

సంధి॥ ఇట్లభిమన్యుండు తల్లినిన్నిద్రింపంజేసి తనమనంబున వితర్కించుచుండె నెట్లనిన.

అ॥ సీ. గట్టులన్నియు దెగ ♦ గొట్టినజెట్టి యూదుశ్ర్వవసునకు పౌత్రుండ
నయ్యు । పశుపతితో బోరి ♦ పాశుపతాస్త్రంబు గొన్న యర్జునునకు ♦ గొడు
కునయ్యు । అఖిలలోకంబుల ♦ కాధారుడైన శ్రీహరికి మేనల్లుండ
నయ్యు మరియు । సహిత జనాటవిక ♦ నలుడౌ పావని సూనునకే
నను ♦ జుండనయ్యు । నహహా యిటువంటికష్టంబు ♦ లనుభవించ ।
వలసె నేనేమిసేయుదు ♦ వనజజన్ము । డిటుల వ్రాసెను గాబోలు
నిటలమందు । నిట్టిదురవస్థ మాన్పవా ♦ రెవరుగలరు.

అ॥ మాట. ఆహా గట్టులను గొట్టినట్టి జెగజెట్టిసుతునకు పట్టినై హరికి మేనల్లుండనై యింతకష్టంబు నొందవలసివచ్చె. దైవమా నేనేమి సేయుదు.

అ॥ గీ. శాప్రకే శశిరేఖ నా ♦ భార్యయనుచు । బొంగుచుంటిని యిట్లట
బుద్ధి తెలియు । తానొకటి దలచునంతట ♦ దైవమొకటి । దలచు
ననియెడి లోకోక్తి ♦ తథ్యమయ్యె.

అ॥ మాట. యాబలభద్రుడు ప్రతిన దెచ్చి నాకు పరిణయంబు జేయు హేతువెవ్వరు గాన్పింపరయిరి. నేనొకటిదలంచ దైవంబొకటిదలంచె. నింక నేనేమి సేయుదు. (ఆలోచించి) ఆహా! యిదియునుంగాక బలరాముండాడు భాషణంబులు తల్లిచెవిని తామసంబుచే తల్లినద్దోడొని యీపటాశ్వత్థ జంబీరపనస రసాలాదిభూజంబులును శరభ శార్దూలాది చమరీ భల్లూక మదేభాది మృగంబులునుగల యీ ఘోరారణ్యంబు జేర సిప్పుడు మాతల్లి మార్గాయాసంబున రాలేకయిచ్చట శయనించె యింక శేషు నెటువలెనడుచునో దెలియదాయె! దైవమా! యింక నేనేమి సేయుదు. (విచారించి)

అ॥ మాట. ఆహా! యెచ్చటనో మృగగర్జనంబులు వినవచ్చుచున్నవి. ఈకోదండంబు నెక్కువెట్టి కొట్టెదను.

నారీఝంకారంబు జేయుట,

సం॥ ఇట్లభిమన్యుండు కోదండంబు నెక్కువెట్టి నారీఝంకారంబు జేయ తద్ధ్వని కొండగుహలన్ ప్రతిధ్వనులిచ్చె. పక్షులు కులాయంబుల

నుంచి భోరె నట్టియారావంబు ఘటోత్కచుండువిని ప్రళయకాల
రుద్రునిపగిది కోపోద్దీపిత మానసుండై పండ్లు పెటపెటంగొరుకుచు
నేత్రంబుల నగ్నికణంబులురాల మహోగ్రుండై వచ్చుచుండె
నెట్లనిన.

(తెరలో కలకలముచేయుట.)

ఘటో॥ కం. సురలకు సిద్ధులకేరికి । నారశక్యముగాని యడవి ♦
జొచ్చియు గిరిగ । హ్వారములు మోయగ విల్లును । మొక్కయించెడు
నట్టిమేటి ♦ మొనగాడెవడో.

దర్వు-శ్రీరంజనిరాగం-ఆటతాళం.

ఏవడుర నావనము జేరిన వా । డెవరురా । ఏవడురా నావన
ము జేరిన । భువినిమరణం బనుచుదెలియడె ॥ఏ॥ సురలు యక్షులు సిద్ధ
సాధ్యులు కి । న్నర గరుడ గంధర్వభుజగులు । జొరరు నావనమున
భయంబున ॥యె॥ అరయ దైవంబాహారముగనాకు । కరుణతో బంపి
నట్లున్నది । కబళముగ భక్షించెదను భళి ॥యె॥ పొట్టగొబ్బిన్ని చేబట్టి
ధనువు నెక్కు । బెట్టితివి నాగుట్టు తెలియక । పొట్టకొవ్వునుతీతు
జూడుము ॥ఏ॥ ధరణిగొల్వేపల్పుగవాసు సాక్షిగ । దురములోనినుబట్టి
యిప్పుడె । శిరముగాఖండించెదను భళి ॥యెవడురా॥

ఘటో॥ మాట. అరే నరాధమా! సుర యక్ష సిద్ధ సాధ్య గరుడ గంధ
ర్వోరగాదు లెవ్వరు జొరజాలని యివ్వనంబునకు నర్ధరాత్రంబున
నరుదెంచితివి. నీవెవ్వడవురా! కొత్తగా జంపబడిన మనుష్యుని
మాంసంబును వెచ్చని పచ్చినెత్తురును యెట్లులభించునని యత్నిం
చుచుండ దైవంబు నాకాహారంబునకై తిన్నగా నిన్ను బంపినట్లున్నది.
కడుపు నిండునట్లు నిన్ను మ్రింగెదను జూడుమురా.

అ॥ మాట. ఆహా! దురాత్ముండగు దానవాధముండెవ్వడో వచ్చు
చున్నవాడు. వీనికంఠంబు దునుమాడెదను. అరే దురాత్మా! దాన
వాధమా! నీవేమివచించెద వేమివచించెదవు?

అ॥ గీ॥ రాక్షసాధమ నీవున ♦ న్నీక్షణమున । భక్షణముజేతు నంచును ♦ బల్కెదిపుడు । బలముగలదేని రమ్ము ని♦న్నట్టినట్టి । దయ్యమును నేడు వదిలింతు ♦ కయ్యమునను.

అ॥ మాట. అరే దురాత్మా దానవాధమా! నీవేమని యెదవు? నన్ను భక్షించెదనని బలుకుచుంటివా మంచిది వెయ్యిమాటలేటికి కయ్యంబునకు రమ్ము. నీదయ్యంబు విడిపించెదను.

ఘ॥ మాట. అరే నరాధమా!

ఘ॥ గీ. ఎవ్వడవురోరి నీవిట్లు♦ క్రొవ్వుబట్టి యిటకునిర్భీతి నరుగుదెం ♦ చుటయుజూడ । వంటయింటికికుందేలు ♦ వచ్చురీతి ॥ గాదె నీవింక బ్రతికిపో ♦ గలవె నేడు.

ఘ॥ మాట. అరే మానవాధమా! వంటయిల్ జొచ్చినకుందేలుచందంబున నీవింకెటు బ్రతికిపోగలవురా.

ఘ॥ మాట. ఏమేమి యేమేమిదురాత్మా.

అ॥ ద్వి॥ ఓరోరిదానవ యోరిదుష్టాత్మ । వీరుండననినీవు విర్రవీగెదవు । రావణ కుంభకర్ణాదులు తొల్లి । నీవలే గర్వించి నెగడుచునుండ । శ్రీరామలక్ష్మణుల్ చేరి వేవేగ । క్రూరాస్త్రములనుయా కుటిల దానవుల । హతముగావింపరే యారీతినీవు । అతులమదంబున నదరెదవేర । మానవుండనీకు మదిదోచెనేమొ । యేనుగు సింహంబు కొనకుంగదగునే । ఘోరానర్థము పారిపోకనాతోడ క్రూరబాణముల నీగుండెలు జీల్తు.

అ॥ మాట. అరే దానవాధమా!

సంవాదం-దరువు-సౌరాష్ట్రరాగం-ఆటతాళం.

అ॥ తారతమ్యములేక తప్పుకూతలుగూయు । మేరగాదు పోపోరా యోరీ । యారీతి బల్కిన యిపుడె నీశిరము యీ । క్రూరాస్త్రమున దుంతురా ॥తార॥

ఘ॥ బాలుడనాతోటి బంటువంటివాము నీ। కేల చాలిక పోపోరా కాలునిదండము బోలు యీ। శరమున లీలగ నిను ద్రుంతురా॥చాలు॥

అ॥ అద్దిరద్దిరయిట్లు। గద్దరితనమున। వద్దులాడబోకురా। యోరీ। హద్దుమీరిననిన్ను। ప్రొద్దుకామరునికడకు।తద్దయుబంపుదురా॥అ॥

ఘ॥ వెయ్యేలమాటలు కయ్యమునకురమ్ము। దయ్యము వదలింతురా నీవు। కుయ్యో మొర్రో యని కూతలుబెట్టగ। చయ్యన భక్షింతురా ॥బా॥

అ॥ ధరణిగోల్వెపల్లి పురవరుసాక్షిగ। శిరముద్రుంచెదజూడగా యిట్లు పరిపరివిధముల భాషించనేల యీ। శరముచేతనుగూల్తురా ॥దా॥

అ॥ మాట. అరే ధురాత్మా దానవాధమా? యెందుకిట్లు ప్రేలెదవు దుఃఖముండిన కన్నీళ్ళువిడువవలయు. క్రోధముండిన ఆయుధసహాయుండవైయుద్ధమున కురుకవలయు. అంతియేకాని యెందుకీ ప్రగల్భంబులు గొట్టుట.

ఘ॥ మాట, ఒరే నరాధమా నీవేమనియెద వేమనియెదవు. నాకుదుఃఖముండిన కన్నీళ్ళతో నా దీర్చుకొమ్మనియెదవు? ఖడ్గముతో గాదేమి జూడుము, మంచిది.

ఘ॥ సీ ధరణీధరంబులు ♦ తలక్రిందులయినను। తారాగణంబులు ♦ ధరణి బడిన। సొరది నంబోనిధుల్ ♦ శుష్కీభవించిన। తరణి చంద్రులు గతుల్ ♦ దప్పిచనిన। శేషుండు దావేయు ♦ శిరములు వంచిన। దిగ్దంతులెల్లను ♦ దిరిగిపడిన। అగ్నిహోత్రుండు ♦ శైత్యంబువహించిన॥ బ్రహ్మాండ భాండంబు ♦ పరియలైన। గట్టిగాబట్టి నిన్ను నే ♦ కట్టికొట్టి। మట్టుపెట్టెద జూడుము ♦ మనుజహీన। వట్టివాదంబునాతోడ ♦ వలదురమ్ము। కరువుదీరంగ భక్షింతు ♦ కడుపునిండ.

ఘ॥ మాట. అరే నరాధమా నిన్ను కబళంబుగాజేసి భక్షించెదజూడుమురా.

అ॥ మాట. యేమేమీ? దురాత్మా!

సంవాదం – దరువు – కాంభోజిరాగము – ఆదితాళము.

అ॥ ఓరి నీవిటులప్రేలనేటికిరా । యీరేడు జగముల లేరు సరివారంచు బల్కకురా । ధారుణిం దనుజాధమా నిను । పోరులో ఖండింతు జూడు ॥ యోరి ॥

ఘ॥ యేర నన్నెదురించనేటికిరా ॥ మనుజాధమా ! యీ ఘోరశర మునదుంతు జూడుమురా । తారతమ్యమెరుంగకను యిటు ॥ మీరి కేరుచు బల్కెదవు భళి ॥వేరకు॥

అ॥ నన్ను గెల్తునని గోరుచున్నవాడవు సారెకు । నన్ను గెల్తునను భ్రమ నున్నయానురా । కన్నుగానకను నాతో కయ్యము సల్పితివేని ! పన్నుగ నిను బట్టి చీరి । బంపెద శమనుని పురికి ॥ఓ॥

ఘ॥ శూరగులలోపల నేనే ! శూరుడనని బల్కెవు । పోరులో నిల్వ ము యింక పారిపోకురా । వారిజాసనాది సురవర్యులు తో డైనను । యీ । క్రూర శరముల నిన్నుగూల్చక యుందునే భళి ॥ యే ॥

అ॥ గురుతెరిగియుక నన్నుగూయుచు నీవిప్పుడిట్టు । మురియుచునుం టివి యోరి మూర్ఖదానవా ॥ ధరణిగో ద్వేపల్లిపుర । వరదునిసాక్షిగ నిన్ను । దురములోన బట్టినేడు । శిరమును ఖండింతుజూడు ॥యోరి॥

అ॥ మాట. అరే దానవాధమా వెయ్యిమాటలేల కయ్యంబునకు రమ్ము

ఘ॥ మాట. యేమేమి? యేమేమి? మానవాధమా!

ఘ॥ కందార్థం. ఏ రాశూరులలోపల । శూరుడ నేనేయటంచు ♦ శుష్క ప్రియము లే । యీరీతి బల్కెదవు యీ ధారుణి! నను గెలువదరమె♦ దగదు పోపోరా । మనుజాధమా! తగవేలపోరా । జగతిగో ద్వేపల్లి బగవాహనునిసాక్షి ♦ పొగరుమూర్ఖదను యీ । పోరులోని వ్వాడే!పొగరుచే కులపర్వతము తో ♦ తగరు తాకిన మాడ్కి నాతో! బగడమునకై వచ్చెదవు నిను । జముపురంబునకనిపెదను భళి♦తగ దు పోపోరా.

అ॥ ఛళాఛళా! యేమేమి దైత్యాధమా!

ఆ॥ కందార్థం, యేరా దైత్యాధమ నా । శూరత్వం బెరుగలేక ♦ శునకమువలె నీ । వీరీతి మొరగెదవు నే । డౌరా నాముందరిట్టు ♦ లదరకురోరీ । అసురాదమా! ఏట జీల్చునోరీ । కదనమందుననిన్ను ♦ ఖండించి తలనున్న । మెదడుదీసెనీను । మదమడచెద జూడు♦గొదమ సింగము డాకనురుగక । గొంకనక్కదురించువిధమున । మదముచే నీవేళ నాకో ♦ కదనమున నెదురించెదవు భళీ ॥అదరకురోరీ ॥

ఘు॥ మాట. యేమేమి నరాధమా! మంచిది.

సంవాదం - దర్వు - అరభిరాగం - గాపుతాళం

ఘు॥ యేరా మానవాధమా! యిటులబల్కెదవేర మానవాధమా॥ సారెసారెకును మీరుచు బల్కెద । వేర నాభయం బేమియులేకను ॥యే॥

అ॥ ఔరా ధానవాధమా । అదరకురోరి ॥ఔ॥ యేర నీకు సరివారు లేరనుచు ॥ కేరిబల్కెదవు ॥ పారిపోకురా ॥ఔ॥

ఘు॥ నన్ను గెల్చెదననిన। నవ్వువచ్చెర ॥నన్ను॥ యిన్నిమాటలేల నరులు దనుజుల కన్నమనుచు భువిమున్నెరుంగవె ॥యేరా॥

అ॥ వలదు వైరము పోపోరా । చాల్ చాలునిక ॥వల॥ బలముగల దనుచుబల్కి పొంగకురా । యిలనుగూల్తు నాకులుకులచేతను ॥ఔ॥

ఘు॥ వట్టిమాటలేల నా । గుట్టుదెలియక ॥వ॥ యిట్టివాదమేల జేసెదవు నీ। పొట్టకొవ్వుదీతురమ్మ రమ్మిక ॥యేరా॥

అ॥ తరమె నీవు నన్నెలువ । దగ వేలపోరా । ధరణి గొల్వేపల్పురవరు సాక్షిగ । శరములచే నినుజీల్చివైతురా ॥ఔరా॥

ఘు॥ యేమేమి?

ఘటోత్కచుడు - మత్తకోకిల.

పొట్టకొవ్వెగదట్టి నీవిటు ♦ భూరివిక్రమ మొప్పగా । మిట్టి మిట్టి పడంగనేలర ♦ మీ రెరుంగక నివ్వాడీ । వట్టివాదమదేల రమ్మిక ♦

వాడిగల్గిన తూపులన్ గట్టిగా నిను జీల్చియిప్పుడే ♦ కన్నిండలెల్ల భుజిం చెదన్.

అభిమన్యుడు, పంచామరము.

అరే దురాత్మ నీవు యిట్టు ♦ లాడజెల్లునే, భళా । ధరేంద్రముల్ పడంకనేని ♦ ధాత్రిసంచలించినన్ । హారామదాదులడ్డమైన ♦ యాలమందుగూల్చి ని । న్నరేతరాట్పురంబు జేర్తు ♦ పారిపోక నిల్వరా.
మాట. అరేదురాత్మా ! నరాధమా ! యీ యాతుధానాస్త్రంబున నిన్ను జముపురంబు జేర్చెద, జూడుమురా!

ఆ॥ మాట. అరే! దానవాధమా! నీయాతుధానాస్త్రంబు యీవైష్ణవ
బాణంబుచే ద్రుంచెదను, జూడుమురా!

యుద్ధము, దర్వు - నాటరాగం - ఆదితాళము.

కయ్యముజేయు సాగిరీ - గాంభీర్యమున ॥క॥ కయ్యమందు జయకాంక్షల శరములు చయ్యనవాసులు సారించుచు వడి॥క॥ ముదురు పులులరీతిగా । బొబ్బలిడిన । చెకలు రొదలు నిండగా । త్రిదశులెల్ల నద్భుతముగ జూడగ ! మదకుంజరములు । మార్కొను రీతిని ॥క॥ ధరణి దిద్దిర దిరుగగా । భాస్కర హిమ । కరులు గతులు దప్పగా । ధరణీ గొల్చెప ॥ ల్పురమున కెలర్చి । సరసిజనాభుని స్మరియించుచు వడి ॥కయ్యము॥

(అంత సుభద్ర నిద్రలేచి) మాట. ఔరౌరా దురాత్ముండగు దానవాధముండెవ్వడో నాముద్దులపట్టితో బోరాడుచుండె. యీ దురాత్ముని సంహరించి నాకుమారుని రక్షించువారెవ్వరును లేరుగదా! యింక నేనేమిసేయుదు యాహాలాయుధుం డభిమన్యునకు తన పుత్రిక నిత్తునని చెప్పి నేడు దుర్యోధనపుత్రునకిత్తుననుటచేగదా యింత వచ్చె. యింక నీశ్వరాజ్ఞ యెట్లున్నదో తెలియదాయె ? నే నేమి సేయుదును.

సంధి॥ ఇట్లున్నసమయంబున హిడింబ జనుదెంచి వారికయ్యంబు గాంచి
మనంబున వితర్కించుచుండె నెట్లనిన.

మోహి॥ మాట. ఔరౌరా ఎవ్వరో నరాధముండు నా కుమారునితో బోరాడుచుండె, యీ శస్త్రవిద్యాధురీణుండగు రాజకుమారునితో నాకుమారుండు బోరాడగలండే? అయ్యయ్యో! యీ పోరు నుడుపు వారెవ్వరు గాన్పించరయిరిగదా! యింక నేనేమిసేయుదు దైవమా.

అంత॥ ఘ॥ మాట. అరే మానవాధమా.

ఘ॥ క. వచ్చెను నాబ్రహ్మాస్త్రము। విచ్చలు గ్రమ్ముచును నిన్ను జీల్చుటకొరకై। జచ్చెదవు నేడు నీవిటు। మచ్చరమున గూయనేల మనుజవిహీన.

ఘ। మాట. అరే నరాధమా। యీ బ్రహ్మాస్త్రంబున మడిసెదవు జాడుమురా.

అ॥ మాట. అరే దానవాధమా యీ బ్రహ్మాస్త్రంబుచే నీ బ్రహ్మాస్త్రంబు నడ్డగించెద జాడుమురా.

సంధి॥ ఇట్లుఘటోత్కచాభిమన్యులు బెబ్బులులవగిదిఁ బోరిపోం తుదకు బ్రహ్మాస్త్రంబులు ప్రయోగింప నాయస్త్రంబులు బోరాడదొడంగ నంత కులాచలంబులు చలించె. రవిచంద్రులు మార్గంబుల దప్పిరి. అమరులు భయకులచిత్తులై రట్టి సమయంబున త్రికాలవేదియగు వేదవ్యాసుం డరుదెంచె నెట్లనిన.

ద్వి॥ ఓరోరి నరుపుత్ర యోా భీమపుత్ర। క్రూరాస్త్రముల నిట్లు గూర్చె దరిపుడు । మీరు సోదరులయ్యు మీరుచు గడక । నీరీతిసాహసం బేలజేసెదరు । చాలుచాలుడు గడు సమ్మతితోడ ॥ మేలుగల్గును మీకు మేదినిలోన.

మాట. ఓరి భీమనందనా! యోరి యర్జునపుత్రా! మీరెంత వింత గా వింపుచుంటిరి మీ రన్నదమ్ములవుట దెలియక యిట్లు సాహస కృత్యంబులు సేయుచుంటిరి. చాలు చాలు. శాంతింపుడు యింక మీద మీకుశుభంబుచేకూరు మీకు కృష్ణుండు ప్రాపు గా గలండు నేను పోయివచ్చెదను.

ఘ॥ వేదవ్యాసమునీంద్రా! నమస్కరింపుచున్నాను.

అ॥ యతిశ్రేష్ఠా నమస్కరింపుచున్నాను.

వే॥ సుఖీభవ సుఖీభవ సుఖీభవ.

(అంత ఘటోత్కచుడు అభిమన్యుని కౌగలించుకొని)

ఘ॥ కం. అనుజుండని దెలియక నే। నునిశితబాణములచేత ♦ సొక్కించితి నిక్క।దనువున రక్తము వెలువడ। ననుమానము కొంతలేక♦ నతిదుర్మతినై.

మాట. అనుజా యభిమన్యా యిట్లు మీారరణ్యభూముల కరుదెంచు విధంబు నడుగక నిన్ను నరాని యవమానవాక్యంబులాడి దురంబు సల్పితి. నేనెంత దురాత్ముండనో గదా!

(హిడింబ సుభద్రనుజూచి) మాట. సుభద్రా!నీవిట్లేల చింతించెదవు? భగవంతుండొనరించు కార్యంబునకు బ్రతిసేయువారు ఎవ్వరును లేరుగదా. పరాశరసూనుం డెరింగింపకుండినేని వీరిరువురును కయ్యంబున మడిసెదరు. నమ్మహాముని కారుణ్యంబున జీవించితిరి. గాన నాకుమారుని తప్పు సైరించి సంతసింపుము చెల్లెలా.

ఘ॥ సుభద్రనుజూచి ,నేనెరుంగక చేసిన కార్యంబు దప్పితంబుగా దలంచక నన్నుగావగలందులకు మిక్కిలి ప్రార్థించుచున్నాను తల్లీ

సు। మాట. కుమారా యిట్లు ఖిన్నుండవయి యుండనేల? మున్నెరుంగని హేతువువలన నీయరణ్యంబున నిన్నిసమకూడే. నీవిటనుండు సంగతి మాకేమియుఁ దెలియదాయె. మేమిట కేతెంచుటయును నీ వెరుంగవయితి విప్పుడు మీారు యతిశ్రేష్ఠుండగు పరాసరసూనుం డెరింగింప బ్రతికిరి. చాలుచాలు గ్రహపీడనం బింతజేసె యింక నీవిట్లు ఖిన్నుండవై యుండనేల.

ఘ॥ మాట. తల్లి మీారలీ యర్ధరాత్రింబున యీా యరణ్యభూముల కరుదెంచు విధంబు నెరింగింపుము.

సు॥ మాట. కుమారా నేనేమి చెప్పుదు.

సు॥ ద్వి॥ వినుము కుమార నే వినిపింతునీకు । ఘనుడైన హలపాణి కరుణవలిర్ప । తనపుత్రికనునాదు తనయునకిత్తు । ననివచించెను మున్ను హర్షంబుదోప । నా డాదిగా మేము నమ్మికనుండ । నేడు క్రూరాత్ముడై నేసివ్వననుచు । ధనహీనులమటంచు దగనెంచి మమ్ము । యనరాని దుర్భాష । లాడి పాండవులు । యడవిజాగు లటంచు హాస్యంబులాడి । కడుక్రూరుడై పుత్రి । కను లక్ష్మణు నకు ॥ బరిణయంబొనరింతు బాగుగాననుచు । ధరధరుం డిదినీకు దగజసిదెల్ప । వినక రారాజుని వినుతిసేయుచును । ఘనముగా యత్నంబు గావించుచుండె నంత.

గీ. బలునిచరణాబ్జములు నేను ♦ బట్టివేడ । గన్నులరుణంబుగావించి ♦
నన్నుగాంచి ॥ కూడుమెక్కుట యేగాక ♦ గోడలనుచు ॥ వేడెదవు
చాలు ఛీ యిక ♦ వెడలుమనిరో

సు॥ మా. కుమారా నేను బలరాముని పాదంబులపైబడి ప్రార్థింప నన్ననరాని యవమానవాక్యంబులాడి పొమ్మనిన వచ్చి తద్వాక్యంబు లభిమన్యునకున్ దెల్ప కోపించి యీ యర్ధరాత్రంబున నన్నుందోడ్కొని యీ ఘోరారణ్యంబున కరుదెంచె: మమ్మెరీతి నైనను పాండుపుత్రులుండు తావునకు జేరిచి రక్షింపుము. దయావిహీనుండగు హలాయుధుండింత జేసె. నేనేమిసేయుదును ?

ఘ॥ మా. యేమేమి యేమేమి భళాభళా బహుబాగున్నది.

ఘటోత్కచుడు - పంచచామరము.

భళాభళా బలుండు నేడ ♦ హార్యగర్వమొందినా।
బలంబుగానకొల్ల నిల్లు ♦ బల్కె లెస్సగాను భూ।
తలంబువంక వానిఁగూల్చి ♦ దప్పకుండగాను నా।
చరంబుమీరగాలు జేర ♦ సాగనంపెదన్ పడిన్.

దర్వు, [illegible] రాగం-రూపకం.

ఇటులబల్కె నే రాముడు । వాడేమియు । మదిభయము లేక
॥ని॥ పటుబలాఢ్యులనుచును మది । పాండుసుతుల దలచక భళి ॥యి॥ బల

రాముని వాక్యంబులు । మ లుకులుగా నా కు చెవుల । తులువతనంబున పలికిన। పలుకుల ఫల మనుభవించు ॥నిటు॥ సుందరాంగి పెండ్లి జేయు। మందిరమున జేరి వారి । నందరి సిగబట్టి నీదు । ముందరనుంచెదవు జూడు ॥మిటు॥ శరిపు రేందు శిరము దుంచి । కర్ణుని గర్వంబడంచి । దురమున దుశ్శాసనాది । దుర్మతులను దెగటార్చెద ॥నిటు॥ ధరణి లోన గొల్లవల్లి । నరుని సాక్షి నీసుతునకు । దిరముగ బలరాము సుతను పరిణయంబు జేసెద భళి ॥ యిటుల బల్కె నే॥

ఘ॥ మాట. తల్లీ నీ వెంతమాత్రము చింతిల్లెదవు.

కం. గట్టులగొట్టిన యాజగ । జెట్టి సుతుని పట్టికపుడు ♦ చేడియ! శశి నే! దిట్టమున దెచ్చి యిచటికి । గట్టిగ నే పెండ్లి జేతు ♦ కమలజ నేత్రీ.

ఘ॥ మా. తల్లీ.

ఘ॥ ద్వి॥ బలునకు మనకును బగ జేసినట్టి । యులను యోధనుబట్టి య వని పైకూల్చి । సింధు దేశాధిపు సిగ జేతబట్టి । బంధించి కానీను బట్టి క్షేత్రమున । ముక్కును గర్ణముల్ మోటులు జేసి చెక్కలు గాగను జీల్చి సౌబలుని । యురయుచు గురుపీసు లందరిబట్టి । వరు సగాత్రుంగెద వారి పక్షమున । బలసి యాదవులెల్ల వచ్చిన నాడు। బలము చే వార్ధిలో బడవైతు రాము। డప్పు డాడిన మాటలన్నియు మదిని । తప్పితంబులటంచు దలచు మనుండ॥

మాట. తల్లీ నీవిక్కట్లు చింతించెదవు. బలరామునకును మనకును భేదంబు గలుగ జేసిన యాధార్తరాష్ట్రులకు బట్టి కయ్యంబునకు బడగొట్టి యా హాలాయుధుపట్టిని దెచ్చి గట్టిగా దశమిలగ్నంబున పరిణ యంబు జేసెదను నాపరాక్రమంబుగనుము.

ఘ॥ కం. వారాంధులింకగ నీ । మేరువు దలక్రిందుగాక ♦ మేదిని బడ నీ। తారలు గడుమల్లగ నీ। తారాధిప రేఖ దెచ్చి ♦ తమ్ముని కిత్తున్.

ఘ॥ మాట. తల్లీ! హాలాయుధుండు యాదురాత్ములగు దుర్యోధనా దుల వినుతించుచు పాండుపుత్రుల నిందించెనా? మంచిది యింక నీవు చింతించవలదు.

సు॥ మాట కుమారా యిట్టి ఘనవీరుండగు నీవా సుయోధనాధుల జంపితివేని మీ జనకుల ప్రతినలు భంగంబులవుగాన వారివధించక నీ బుద్ధికెట్లుతోచునో యట్లు గర్వభంగంబుమాత్రంబొనర్చి త్వరగా శశిరేఖనుదెచ్చి నీ తమ్మునకు వివాహంబుజేయుము

ఘ॥ తల్లీ లగ్న కాలంబరుదెంచువరకు నిచ్చట నుండుదమురండు.

సంధి॥ ఇట్లు ఘటోత్కచాభిమన్యులు శశిరేఖ వివాహ మహోత్సవ కాలంబు నిరీక్షించుచుండిరంత ద్వారకలో సుభద్రాభిమన్యులు వెడలి చనిరని విని శశిరేఖ మనంబున వితర్కించుచుండె నెట్లనిన.

శ॥ మాట. ఆహా నేనెంతపాపంబు జేసితినోకదా! మా తండ్రిగారు నన్ను దుర్యోధనపుత్రునకిచ్చుట నిశ్చయించి సుభద్రను కొన్ని యనరాని యవమానవాక్యములు వల్క సుభద్ర యర్ధరాత్రంబున దన పుత్రునితో ఘోరారణ్యంబునకున్ జనెనట. యింక నేనే మిసేయుదు చిన్నతనంబునుండి యభిమన్యుని మగనిగా భావించి యుండి నేడు పరునివివాహంబై బ్రతుకుటకంటె ప్రాణంబుల విడుచుట మేలుగాన నే నీటనో త్రాటనో ప్రాణంబుల విడచెదను. (త్రాడు వురిబెట్టుకొనబోవుట అంత నారదుండరుదెంచుట.)

నారాయణ నారాయణ, హరి, వాసుదేవ యేమేమి? యేమేమి?

నా॥ గీ. యిట్టిసాహసమేల నీ ♦ కిందువదన। పార్థసూనునిమున్న
నీ ♦ పతినిగాగ। సృష్టి యొనరించెసుమ్మి యా ♦ స్రష్ట నీదు। కోర్కె
సమకూడు నిజముగా ♦ కోమలాంగి.

మాట. యిందుముఖి నీవెందుకిట్లు సాహసంబుచేసెదవు? పార్థసూనుని మున్న నీపతినిగా పరమేష్టి సృజించియుండె, గాన సుముహూర్తమువేళ కతని చూచెదవు యిట్లు సాహసంబు చేయవలదు నేను పోయివచ్చెదను.

శ॥ నారదమునీంద్రా! నమస్కారము.

నా॥ శుభమస్తు. అవిఘ్నమస్తు. వివాహసిద్ధిరస్తు.

సంధి॥ ఇట్లు నారదుండెరింగించిచనిన శశిరేఖ సంతోష సాగరంబునన్ దేలుచుండె నంత బ్రాహ్మణులరుదెంచి దుర్యోధనుఁ గాంచి యిట్లనిరి.

బ్రా॥ మా. దుర్యోధనమహారాజా నేము ద్వారకా పురంబునకుఁ జని హలాయుధుంగాంచి మంగళద్రవ్యంబులొసంగి భవత్సూనునకు శశిరేఖ నొసంగుమని వేడ నందుకానందించి దశమిరోజు ముహూర్తము నిశ్చయించి సుముహూర్తంబునకు మిమ్మురఁ దోడ్కొని రమ్మని బంపె. నేటికి యీ హలాధునితోటి వియ్యంబు సమకూడె గాన రేపె ద్వారకపురంబునకు పయనంబుజేయవలయు

దు॥ మాట. మంచిది యీనాఁ! ఏమి నాభాగ్యము. వింటివాతమ్ముడా దుస్ససేనా!

దు॥ గీ. బలునితోడ నేఁడు ♦ బంధుత్వమబ్బెను। గాన వారు మనము ♦ గలసి పాండు । సుతులఁ జంపి రాజ్య♦సుఖమంతయును మన । మను భవించవచ్చు ♦ నళుకులేక.

దు॥ మాట. దుస్ససేనా! నేఁడు యీసీరాయుధుని తోటి వియ్యంబు సమకూరె. మనమును వారును గూడి పాండుపుత్రులఁ జంపిరాజ్య మెల్ల శాశ్వతంబుగ నేలెడుసమయంబబ్బె, గాన మన భటపుష్యాహంబుల రప్పించి పట్టణాలంకారంబు జేయుఁ బనిచి బ్రాహ్మ క్షత్రియ వైశ్య శూద్రాకులకును పలువుర పుష్పవిక్రయులకును నృత్యగీతాభినయ ప్రవీణలైన గణికాంగనలకును వస్త్రదానంబులు జేసి కావలసిన ద్రవ్యంబులు శకటోపరగ శకటాదుల పైగట్టి త్వరగా సకలపనులు నెరవేర్పుము.

దుస్స॥ మాట. అట్లే త్వరగా నెరవేర్చెదనన్నా దుర్యోధనా.

సం॥ ఇట్లు బల్కుచున్న దుర్యోధనునిన్ గాంచి భీష్మద్రోణు లిట్లనిరి.

భీష్మ॥ మాట. దుర్యోధనా! నే నొకటి దెల్పెదవినుము.

భీ॥ కం. సిరాయుధుడే దన కా। సారముఖి గల్గినపుడె ♦ సౌభద్రు నకుఁ। దారగచేసెద నని నిపు। డీరీతినిటులు యత్న ♦ మెందుకుసేయన్.

భీ॥ మాట. దుర్యోధనా యిట్టి ప్రయత్నంబేల జేసెదవు బలరాముడు పట్టి బుట్టినప్పుడే పార్ధుపట్టికిత్తునని గట్టిగాబల్కె నట్టిమాటలు వట్టివిగా దలంచి యిట్టిప్రయత్నం బేలజేసెదవు? పార్ధుపట్టికిగాక నీపట్టికిదక్కనే.

ద్రో॥ దుర్యోధనా!

ద్రో॥ ద్వి॥ వినుమాదుర్యోధన విశదంబుగాగ। మనసులో నీవనుమానంబులేక। భానుతనూజుని బల్కులన్నియును॥ వీనులందువజేర్చి నిర్మిగుచును। పరిణయంబున కిట్లు బరుగులెత్తెదవు। సరసిజనేత్రుండు సమ్మతించకను। సాగదులగ్నంబు చాల్ చాలు నింక। వేగ నామాటలు వృధగావుదలవ.

మాట. దుర్యోధనా! యీ వెర్రినీకేల యీసరసిజాక్షుండు సమ్మతించక నీకార్యంబు నెరవేరునే.

దు॥ మాట యేమేమి గంగాపుత్రా! యేమేమి కుంభసంభవా!

దు॥ గీ॥ పెక్కుమాటలు నాతోడ ♦ పేర్లనేల। సౌబలుండును కర్ణుండు ♦ సైంధవాదు। లుండ నిటులాడగానే ♦ నుఱికమిాకు। వెడలిపొండిక చాల్ చాలు ♦ వేయునేల.

దు॥ మాట. గంగాపుత్రా కుంభసంభవా చాల్ చాలు త్వరగాలేచి పొండు.

భీ॥ ద్రో॥ మాట. యేమేమి దుర్యోధనా ! మంచిది.

దర్బ్వ అరభిరాగం – ఆదితాళం

యెందుకు దుర్యోధనా। యిటులపల్కెదవు నీ ॥యెం॥ మంద బుద్ధిచేతను నీసుతునకు। యిందుముఖిని జేసుకొందుననియెద ॥యెం॥ పెక్కుమాటలుమాతో। పేర్లనేటికి। యిక్కరణిని ప్రయత్నంబేలను దక్కదిందు రేఖ నీదుపట్టికి ॥యెం॥ భూధరముల్ చలించిన। న్బాదోధు

లింకిన ॥ గాధలేల కవ్వడినివిడచి యా । మాధవుండిపుడు । మనవశ మగునే ॥ యెం॥ బలుని నమ్మికపోయిన బలుచనగును । ఇలను గౌర్వపల్లవరవరుడనదగు। జలజనాభుడెది। సమ్మతించునే ॥యెందుకు॥

మాట. దుర్యోధనా ? యిట్టి వట్టి ప్రయత్నంబేల భూధరంబులు చలించినను సముద్రంబు లింకినను యామాధవుం డర్జునుని విడచి మన వశంబగునా? యీకార్యంబగునా యిట్టివెర్రి నీకేల,

దు॥ మాట. యేమేమి యేమేమి.

దు॥ గీ. పెండ్లిజూడంగ మీకును ♦ ప్రేమయుండ । రండి లేకున్న యిండ్లకు ♦ పొండి యిపుడు । మీరు రాకుండుటే మాకు ♦ మేటి పెండ్లి । వేడుకలరగ సాగుని ♦ ర్విఘ్నముగను.

దు॥ మాట. గంగాపుత్రా! కుంభసంభవా! యింకమీద నిట్లుబల్కెదరేని సహింపను మేమేకార్యంబు దలంచుకొనినను కాదంచువిఘ్నంబులువల్కెదరు చాలు చాలు మీముదిపోరు మాన్పుకొనజాల మైతిమి మీకురాకుండుటే మేలుగా ఆలోచించెదము. మాపని సాగనిండు మాకిదేకనకస్నానంబు గావించినట్టగు. మిమ్మమనరాదని యూరకున్న యిట్లులక్ష్యంబులేక బల్కుచుంటిరి ద్వరగా లేచిపొండు.

భీ॥ మాట. యేమేమి దుర్యోధనా!

భీ॥ కం. ఈలాగువల్కనీకున్ । గాలము సమకూడినట్లు ♦ గనుపడి మాకున్ । యీలాజేయుట దగదని । చాలా జెప్పినను వినవు ♦ సమ్మతిలేకన్.

మా. ఓరిదుర్యోధనా ! నీవీలాగున పెద్దపిన్న తారతమ్యంబెరుంగక పల్కుట నీకు కాలంబుసమకూడినట్లు గాన్పించుచున్నదిరా.

ద్రో॥ మాట. ఓరిదుర్యోధనా యిక్కరణి పెక్కుమాటలేలప్రేలెదవునీకక్కరగల్గిన బంధువులన్ దోడ్కొని పోయిచక్కగా పరిణయంబు జేసుకొమ్ము మేముపోయివచ్చెదము.

దు॥ మంచిది శీఘ్రముగా దయచేయుడు.

దు॥ మాట. దుస్ససేనా భూసురోత్తముల నిష్ట మృష్టాన్న పానంబుల సంతుష్టులగావించి త్వరగా వరియాణోత్సవంబు నాటిపంబంపుము.

దుస్స॥ మంచిది ఆలాగునే జేసెదను.

దు॥ మాట. కర్ణ సైంధవాది బంధుమిత్రులారా! లగ్నకాలం బరుదెంచె త్వరగా బోవలయు లెండు లెండు.

సం॥ ఇట్లు కౌరవులు సంతోషంబున లక్షణుని పెండ్లికుమారునిగావించి నొక్క మహాగజంబుపై నెక్కించి ద్వారకాపురంబునకుఁ జోవు చుండిరెట్లనిన.

దరువు – దేశియతోడిరాగం – ఆదితాళం

వెడలే ద్వారకాపురికి । వేడుకమీర ॥వె॥ వెడలెభీష్మద్రోణ పీకులిద్దరుదక్క । కడువేగమున నా । కౌరవులందరు ॥ వె॥ బంగరు బెత్తములు బట్టి । ఫణిహారులు । బొంగిముందల నడువ ! మృదంగాది వాద్యముల్ । ధణధణమ్రోయ, గణి । కాంగనలాడగ । కడువా దమొదవగ ॥ వె॥ ధరణిగోత్వేవల్లి ॥ పురినిలయుడౌ । హారినిధిక్క రించుచు । కరిపురేంద్రసుతు । గజముపైనెక్కించి । సరవి వంది మాగధ । సంతతి బొగడగ ॥ వెడలె॥

సం॥ ఇట్లు కౌరవులు ద్వారకాపురంబుజేర బలరాముం డెదుర్కొని దోడ్కొనిపోయి కాంచనమణిమయంబున మందిరంబుద విడి యించె నంత శశిరేఖ యంతఃపురంబులో మనంబున వితర్కించు చుండె నెట్లనిన.

శ॥ మాట. ఆహా! లగ్నకాలంబరుదెంచె నిప్పుడు నేనేమిసేయుదును నాకేమియుఁ దోచదాయె.

శ॥ సీ. జనపతులందరు ♦ జనుదెంచిరిప్పుడె । వ్యర్థమున లగ్నంబు♦ విఘ్నమగును । విప్రచ్యుతనయుని ♦ వీక్షింతుననచును । గలహ భోజనుడెట్లు ♦ గల్లలాడె । యీ లక్షణునకు నే ♦ నిలలోన పత్నినై । యేలాగు కాపురం ♦ బేనొనర్తు । విపినభూములనుండి

విజయ సూనుండిట । కేతెంచుటకు హేతు ♦ పెద్దిగలను।యెదురుకో
ల్వేళవచ్చె ని ♦ కేము సేతు । కటకటా నేడు నాతండ్రి♦ గరుణలేక
నిటుల జేస్సెను మున్ను నే ♦ నెరుగనైతి । నెవరి వేడుదు నిపుడు నే ♦
నెందుజొత్తు.

మాట. అయ్యయో! యచ్చి త్రాగ్రజుం డవివేకంబున నిట్టు జేసె.
నా యర్జున సూనుండగు యభిమన్యునిజూపు పుణ్యాత్ములెవరును
గాన్పించరైరి! దైవమా! నేనేమిసేయుదు.

సంధి. ఇట్లు శశిరేఖ చింతించుచున్న సమయంబున నచ్చట వనంబున
ఘటోత్కచుండు సుభద్రం జూచి యిట్లనియె.

ఘ॥ తల్లీ! సుభద్రా యా వనజాక్షియగు శశిరేఖ వైవాహిక దినం
బరుదెంచె గాన నే త్వరగా।నేగి నా మాయాబలంబున నింతు రేఖఁ
దెచ్చెద శెలవొసంగుము.

సు॥ మాట. త్వరగా బోయిరమ్ము కుమారా.

సంధి॥ ఇట్లు తల్లియాజ్ఞగైకొని ఘటోత్కచుండు గగన మార్గంబున
ద్వారకాపురంబు జేరి మాయాస్వరూపియై బలభద్రు మందిరంబు
జొచ్చి నొక్క దివ్యమణిమయంబైన మంచంబుపై శయనించియున్న
శశిరేఖఁ జూచి తన మనంబున వితర్కించుచుండె నెట్లనిన

ఘ॥ మాట. ఆహా యీదివ్యమణిమయంబగు మంచంబుపై శయనించి
యున్న బాలికారత్నంబీ బలభద్రు పుత్రియే గావచ్చు దీని సౌంద
ర్యాతిశయంబులెన్న వెయ్యినోళ్ళుగల యాదిశేషున కయినశక్యంబు
గాదు. దీనికిని యా సౌభద్రునకుందగు లోకమంతు తమ్ముని
భార్యను ముట్టుటతగదని పెద్దలు వచింతురు గాన యిపుడు నా
మాయచే దీని నిద్రింపజేసి యీమంచంబు నాశిరంబునం దిడుకొని
గగనమార్గంబున నావనంబునకుఁ బోయెద.

సంధి. యిట్లు ఘటోత్కచుండు గగనమార్గంబున తనవనంబునకేతెంచి
శశిరేఖన్ డించి యభిమన్యునిం గాంచి యిట్లనియె.

ఘ॥ మాట. అభిమన్యూ! నామాయాబలంబున నిందురేఖన్ దెచ్చితి నా ద్వారకాపురంబునకు రారాజగు దుర్యోధనుండు పుత్రమిత్రసోద రసమేతుండై జనుదెంచియుండెగాన నేనిప్పుడే జని క్షణములోపల నాకౌరవులను గంతులువేయించి యదుకుమారుల మదంబడంచి వచ్చెద నిచ్చట నుండుము, నేనుబోయివచ్చెద.

అ॥ మాట. అన్నా ఘటోత్కచా! నావిన్నపం బాలకింపుము.

ఘ॥ మాట. అదేమో దెల్పు మభిమన్యూ.

అ॥ ద్వి॥ వినుము నావనిపుత్రి వినుపింతునిచట ॥ ననుడించిపోవుట న్యా యమేనీకు । పుడమిలో గన్నడిపుత్రుడనయ్యు ॥ దడయక ధృత రాష్ట్రి తనయుఁబట్టి । దురములోపల నేను దునుమకయున్న ।ధరణి నాజన్మంబు దగ నిష్ఫలంబు । గాదె నేనిటనుండ కారణంబేమి ! ఆదనేలను వెంటవచ్చెద నిపుడు.

ఘ॥ మాట. అభిమన్యూ యెరుగుదు నీవు నాకంటె నెక్కుడు విలు విద్యా పారంగదుడ వైనను యీ దురాత్ములగు దుర్యోధనాదుల ద్రుంచుటకు మనమిద్దగముఁన్ జననేల నేనొక్కండ చాలును. నిదియునుంగాక

గీ. మేనమామపైని ♦ మేనల్లుడౌనీవు । ధనువుబూనుటరయ ♦ ధర్మ మగునె । గాననుండు మిచట ♦ గడువేగబోయియా ॥ కౌరవులను బట్టి ♦ గండడంతు.

మాట. మేనమామపైని ♦ మేనల్లుండు ధనువుబూనుట ధర్మంబుగాదు గాన నీవిచ్చటనుండుము నేనుబోయివచ్చెద.

అ॥ మాట. అట్లయిన తిమయిష్టప్రకారము బోయిరమ్మన్నా ఘటో త్కచా.

సం॥ ఇట్లు ఘటోత్కచుం డభిమన్యుని నొడంబరచి గగనమార్గంబున ద్వారకాపురంబునకు బోవుచుండె నెట్లనిన,

ఘ॥ మాట. ఆహా! నేను ద్వారకాపురంబునకున్ బోయి యదుకుమారుల మదంబడంచి కౌరవాదముల గంతులు వేయించి యాద్వారకాపురం బల్లకల్లోలంబుగా జేసెద. నింకదడవుసేయనేల త్వరగా బోయెదను.

దరువు - నాటరాగం - ఆదితాళం.

వెడలె ఘటోత్కచుడు। వినువీధిని ॥వె॥ వెడలె ద్వారకకు కడుభీకరముగ। వడిగ యాదవుల బడగొట్టెదనని ॥వె॥ కోదండసింగము రీతిగా। కేకలు వేయ। బెదరిజనులు పారగా॥ పదఘట్టనచే పాదపములు భువి। తుద మొదలవి మదిని దోచక నెగుగక ॥వె॥ కోరమీసాలు దువ్వుచు। సారెసారెకుబలు। మారు కేకలు వేయుచు ధారుణిలో నాధార్తరాష్ట్రులను। జేరి చిత్రములు జేసెదనుచు ॥వె॥ కురులు వ్రేలాడుచుండగా। తారహారము। లురమున మెరయుచుండగా। ధర గోపవల్లవిగోపాలుని। మరువక మదిలో స్మరియించుచు వడి ॥వెడలె॥

సంధి. ఇట్లు ఘటోత్కచుండు గగనమార్గంబున ద్వారకాపురంబు జేరి తనమనంబున యోచించుచుండె నెట్లనిన.

ఘ॥ మాట. ఆహా నేనీ బలభద్రుమందిరంబునన్ బ్రవేశించి శశిరేఖ రూపంబుదాల్చి మెలంగుచు లగ్నకాలంబున లక్షణునకు సింహ శరభ శార్దూలము దేభాది ఘోరమృగ స్వరూపంబులు దాల్చి గన్పడుచు తదుపరి గగనమార్గంబున కేతెంచి నా మాయచే సర్పవృశ్చికాది విషజంతువులను మలమూత్రంబులును శిలలును వర్షంబుగా గురిపించుచు నింక ననేక చిత్రవిచిత్రంబులు జేసి యాకౌరవాధములను గంతులు వేయించి గర్వభంగంబు గావించెద......మంచిది.

సంధి. ఇట్లు ఘటోత్కచుండు మాయాస్వరూపియై బలభద్రు మందిరంబునన్ బ్రవేశించి యిందురేఖాకారంబుదాల్చి మెలంగుచుండె నట్టియెడ బలభద్రుండు బంధువులన్ గాంచి యిట్లనియె.

బ॥ ఏహో బంధుమిత్రులారా! లగ్నకాలంబరుదెంచె మీరేగి త్వరగా యా సుయోధనాదులకు దెల్పుడి.

బంధు॥ ఓహో సుయోధనా! లగ్నకాలం బరుదెంచె త్వరగా లెండు.

దు॥ మాట ఓహో కర్ణ సైంధవాది బంధుమిత్రులారా! యెదురు కోళ్ళయ్యె త్వరగా లెండు లెండు యిం దడవుసేయనేల.

సంధి॥ ఇట్లు. కౌరవు లత్యంత సంతోషంబున బలభద్రుమందిరంబుఁ బ్రవేశించి చిత్రకంబళులపై వసియించియుండె నంత సుయోధను పౌరోహితులు లక్షణు నుచితపీఠంబున నునుచి బలభద్రునిఁ గాంచి యిట్లనియె.

బ్రా॥ మాట. బలభద్రా త్వరగా పెండ్లికుమార్తెను రప్పింపుడు

బ॥ సఖీజనంబులారా! త్వరగా పెండ్లికుమార్తెను దోడ్కొనిరండు.

సంధి అంతశసిరేఖన్ దెచ్చి రత్నపీఠంబున గూర్చుండబెట్టి నట్టిసమయంబున బలభద్రుండు కన్యాదానంబు జేయుచుండె నెట్లనిన.

బ్రా॥ మంత్రములుచదువుట

పౌ॥ అయం ప్ర హూర్త స్సుముహూర్తోస్తు.

(మేళంచెయ్యండి మేళంచెయ్యండి)

(అంత బ్రాహ్మణులు వచ్చుట) హిందూస్తాని తోడిరాగం-ఆటతాళం

వస్తారమరయ్యా । తిమ్మాంభొట్లు । వచ్చినాన్నిన్ని॥కొ॥వస్తారా లక్ష్మణు వైవాహికమునకు । లెస్సగా బహుమతు లిస్తారమవాదు॥వ॥ వేస్తారమ భక్ష్యములే వేడుకమీరగ। యిస్తారమ వస్త్రములే । వస్తురా కురురాజు పర్ణ మానబంపె। పోస్తారమ నెయ్యి పొట్ట నిండునట్లు ॥వ॥ బలభద్రుక్షత్రినమ । లక్ష్మణునకు । పరిణయము చేస్తారమ ॥ ఇలనుగొల్వేపల్లి యిందిరానాథుడు । వలదంచు నన్నకు దెలిపివాడమను న్ను ॥వ॥

మాట. తిమ్మాంభొట్లు అచ్యుతు డొప్పకున్నాటమ యీకార్యంబు కానేరదమ.

రామావధానీ॥ యీమాట యెవరన్నారుఅంచు.

తి॥ ద్రోణ భీష్మాచార్యులు వాదిస్తూవున్నారమ,

రా॥ యెందుకు వాదించుచున్నారు అంఛ,

తి॥ బలభద్రుడు పట్టి పుట్టినప్పుడే యభిమన్యుని కిత్తునని జెప్పి యిప్పుడివ్వననాడమ. యిందుకై యచ్యుతుండు గానీయడమ.

రా॥ అప్పైతే మనమెందుకు పోవలెను అంఛ.

తి॥ పోతే మనకేమి అప్పైతే మనకేమి యిప్పైతే మనకేమి పీలుగా కుంటె తిరిగివచ్చేదము అంఛ,

రా॥ అప్పైతే బాగానే యున్నదిగాని పరాభవము జరుగునేమోయని భయమగుచున్నది అంఛ.

తి॥ పరాభవము జరిగితే కురురాజుకే జరుగునుగాని మనకెందుకు జరుగునురా.

రా॥ తథాస్తు అప్పైతే పోదాము అంఛ.

తి॥ పోదామురండి పోదామురండి.

బ్రా॥ మేళముచెయ్యండి మేళముచెయ్యండి.

(మంగళధ్వనులు మ్రోయుట)

బ్రా॥ అయంము శాంగ్రత్త సుముహూర్తోస్తు.

(మంత్రములు చదువుట)

దు॥ మాట యేమయా కాలాతీతమగుచున్నది. యింక తెరదీసి వేయుము.

(అంత) లక్షణుడు బూదివతె వణకుచున్నాడు.

బ్రా॥ శశిరేఖనుజూడుము లక్షణా!

ల॥ గడగడ వణుకుచున్నాడు.

దు॥ ఇట్లు వణుకుచుంటివేమి సులక్షణా.

ల॥ మాట. నాకేమో శరీరము వణుకుచున్నది.
దు॥ భయపడక తిన్నగా కూర్చుండుమురా.
ల॥ కూర్చొనిలేచి బాబో! బాబో! (యని పారిపోవుచున్నాడు.)
బ్రా॥ మాట. మూర్ఖునివలె పారిపోయెదవేమయా సులక్షణా

(పౌరులు కూర్చుండబెట్టుట)

పౌరు॥ మాట, యేమేమి సులక్షణా ఇట్లు బెదరి గంతులు వేసెదవేమిరా యాహా యాయుధు పుత్రి సుందరంబు గనుంగొ సజాలక దిగులొం దుచు గంతులు వేసెద వేమి యిది రాజపుత్రికను మగతనంబే! చాలుచాలు కూర్చుండుము.

(కూర్చునిలేచి) బాబో నాకు పెండ్లొద్దు.
బ్రా॥ మాట యేమేమి సులక్షణా పారిపోయెదవు.

ల॥ ద్వి॥ అబ్బబ్బ యిదియెక్కడతిఎజూడంగ । బెబ్బులియగుగాని పిన్న దిగాదు । యెక్కడిశశిరేఖ యెక్కడి పెండ్లి । త్రొక్కిచంపునునన్ను తొలగిపోనిండు । పరగబ్రాణములున్న । బలుసాకునైన । విరివిగా మెక్కి జీవించెద నేడు॥

మాట. ప్రాణంబులుండిన బలుసాకునైన దిని బ్రతికెద నన్ను పోనిండు పోనిండు.

బాంధవులు॥ మాట. సులక్షణా ఈచక్కనిబంగరుబొమ్మపై యిక్క రణి పెక్కుమాటలాడ నేటికిరా నిర్భాగ్యుడా మేమిందరముండ నీకేమిభయంబు కూర్చుండుమురా.

(కూర్చుని దిగ్గునలేచి) బాబామాయబ్బ హాక్కిగా నాకు పెండ్లొద్దు

బాంధ॥ అదేమదేమి సులక్షణా మోహినీకాంతవలె కన్యగనిపించు చుండ ఇట్లుబెక్కెదవేమిరా,

ల॥ ద్వి॥ వినుడు బాంధువులార । వినుపింతుమీకు । వనిత యుంచుచును వదలకమీరు । బలిమిచేబట్టినవ్యాధించియిట్లు । బలికెద రిదిజూడ

బలుసుతగాదు । కలికి కుందేలుగా గనుపించెమొదట।పలువిధంబుల
జూడభల్లూకమయ్యె । వెండియు నాయాత్మ వెరగందిజూడ
గండుబిల్లినిబోలి గంతులువైచె ! మదిభ్రమసితి నంచు మరియు
వీక్షింప । కోడమసింగంబయ్యె గూతలువెట్టె । నంతట సూకరం
బయ్యె వావెనుక । కింతగా దయ్యమై వెడలి నన్నిపుడు । మిగ్రింగె
దనని చాల మీానకు దుమికె । భంగపెట్టును నన్ను పారిపోనిండు.

(లక్ష్మణుడు వణకుచు) బాబో. బాబో. నాకు పెండ్లొద్దు.

కర్ణ॥ మాట. యేమేమి? యేమేమి? సులక్షణా.

కర్ణ ॥ గీ. పలుపురము మేము నీకడ ♦ నిలచియుండ । పెద్దపులియెట్టు
వచ్చెర ♦ పెండ్లికొడక । కన్నులనువిప్పి జూడుము ♦ కమలనేత్రి
బెబ్బులియుటంచు బలెదవ్వు ♦ బెదరియిట్లు.

మాట. ఒరే సులక్షణా సాటివారిలో మాటిమాటి కీలాటి బూటకంబు
లేటికిబల్కెదవు చాలుచాలు యీవెర్రిప్రసంగంబు చాలించి యిం
కొక్కసారి వీక్షింపుమురా.

(గుడ్డివానిరీతి దోఢ్కొనిపోయి గూడ్చెండబెట్టెట దిగ్గునలేచి)
బాబో నాకు పెండ్లొద్దే పెద్ద భూతమై మిగ్రింగవచ్చెను నాకు పెండ్లొద్దే
( అంత ॥ కర్ణ. )

కర్ణని-దర్వు-అరభిరాగం-ఆదితాళం

యేరా సులక్షణా ! యిటుల బల్కెదవు నీ ॥ వే ॥ సారెసార
కును । సీరిపుత్రికను । కారుపులియనుచు । గంతులు వేసెద ॥ వే ॥
పెండ్లికివచ్చిన । పెద్దలునగ యిటు । పండ్లికిలించుచు । పరుగులెత్తె
దవు ॥ యెరా ॥ బలభద్రునకున్ । దలనంపులుగా । కలికిగాదు యిది ।
పులియని బల్కెద ॥ వేరా ॥

మాట ఒరే సులక్షణా నీకేమిచేటురా నిన్ను గూడివచ్చిన మాకంద
రికి యీబంధువులలో సిగ్గుగల్లునురా.

( అంతఘటోత్కచుడు విషజంతువుల వర్షము గురిపించుట )

పౌరులు. బాబో! నాకు తేలుకుట్టె. వయ్యారయో నన్ను పాముగరిచె.
( పారిపోవుట )

సంధి. ఇట్లు కౌరవులు దుఃఖించుచు గోచులూడ బారిబోవుచుండ దుర్యోధనుండు కర్ణునిఁగాంచి యిట్లనియె.

దు॥ మాట ఆహా! కర్ణ దుశ్శాసనాది బంధుమిత్రులారా! యొందుకిట్లు విచారించెదరు. ఈకార్యంబెవ్వరో పాండుపుత్రులకు హితులుగా నున్నవారలు గావించి కార్యంబుగా దోచుచున్నది గాన నింక నిట్లు విచారించుట పాటిగాదు. ఆయుధంబులు ధరించి యుద్ధమున కున్ బోవలయు లెండు లెండు.

క॥ మంచిది.

దరువు - నాటరాగం - ఆదితాళం.

శరములు వేయ సాగిరీ । శౌర్యముతోడ ॥ శ ॥ శరములచే యా । చెడుకపటాత్ముని । ధరణికూల్చుమిది । తథ్యంబనుచు ॥ శ॥ సురలాశ్చర్యముగాజూడగా । సేవకులప్పుడు । శరములందించుచుండ । యా దురితాత్ముని మేనురము జీల్చుమని । పరివరి విధము । భావించుచు పడి ॥ శ ॥ చురుకుచూపుల జూచుచు । రోషముతోడల కరుకుమీసాలు దువ్వుచు । ధరగొల్వ వల్పురిని వెలయు (శ్రీ) ధనుని మనంబుల సరకుసేయుకను ॥ శర ॥

( అంత ) ఘ॥ సర్ప వృశ్చికాది విషజంతువులనువర్షముగా గురిపించుట
( అంత బ్రాహ్మణులు పడుచు లేచుచు )

మాట. ఓయిదుర్యోధనా! మమ్మీ పాములబారి ద్రోయు భావ్యమే! మేమింకెట్లు బ్రతుకుదుము యీపరిణయము జూడువేడుకచే నరు దెంచితిమిగాని ఇట్లు పాములచేజచ్చుట నెరింగిన మేమిట కేలవత్తుము.
( అనుచు రోదించుట )

( అంత ఘ॥ రాళ్ళు దొర్లించుట )

పా॥ అయ్యయ్యో నా వెన్ను బోయె అయ్యయ్యో నాతలబోయె బాబో! నాయురంబువగిలె బాబో! నాపాదములకు పాము బట్టుకొని విడువదాయె అయ్యయ్యో నాశిరంబువగిలె. బాబో చన్ను మండ్రి గబ్బలు గుట్టె. అయ్యో నావళ్లు విరిగె.

సంధి. ఇట్లు ఘటోత్కచుండు గగనవీధినుండి సర్పవృశ్చికాది విషజంతువులను పాషాణంబులను వర్షంబుగా గురిపించుచుండె నంతకౌరవులనేక దెబ్బలుతిని దుఃఖించుచుండునంత దుర్యోధనుండు కర్ణునిన్ గాంచి యిట్లనియె.

దు॥ మాట. కర్ణాది బంధుమిత్రులారా! యీదురాత్ముం డెవ్వడో గాన్పించడాయె నాకేయుపాయంబునున్ దోచదాయె నిఁక నేనేమి సేయుదును.

సంధి. ఇట్లు సుయోధనుం డాలోచించుచున్న సమయంబున ఘటోత్కచుండు నిజస్వరూపంబుతో దుర్యోధనుంగాంచి యిట్లనియె.

ఘ। అరే దురాత్మా! దుర్యోధనా!!

దరువు - కాంభోజరాగం - ఆదితాళం.

ఓరీ నీవిట్లు చేయనేటికిరా॥ ఓరోరీ దుర్మతి ॥ యో ॥ ధారుణిని నాపేరువిన్నను। బారుదురు సురులైనగాని ॥యో॥

దు॥ ఔరనీవిటు లాడనేటికిరా । అసురాధమా యిట్లౌర । ఔరదైత్యాధమ నిన్నొక । యంబుచే గూల్చెదను జూడు ॥మా॥

ఘ॥ ధీరులౌ పాండునూనుల । ధాఁణి సంపదలెల్ల కూర్మిరులైచేకొని యీ । కోమలాంగినీయు । ధారుతనీ పుత్రినకు దక్కించు కొని యెదసని। యీరీతి బల్కెదవు నిన్నిప్పుడె ఖండింతు భళి ॥ఓరీ॥

దు॥ యేరా దుర్మార్గ యిపుడు నా। ధీరత్వమెరుగక నీ। వీరీతికఠినములు మీరిబల్కెదొ । పరిపోక నిలువుము ఈ । పోరులో నినుబట్టి దౌర్కజీరి శమనునిపురికి జేర్చెదముజూడు భళి ॥యే॥

ఘ॥ పొట్టకొ్రివ్వు రొమ్ముకెగ । బట్ట నీవిప్పుడిట్టి । మిట్టిమిట్టి పడనేల
మీరెరుంగక । వట్టివాదులేల నాతో । గట్టిగా దురమునకురమ్ము।
దిట్టతనము జూపి పొ్రద్దువట్టి పురమున కనిపెద ॥నోరీ॥

ద॥ చీకటి గల్పించియిట్లు । శిలల బెల్లుగ గురిపించెదవు । నాకు నెది
రించగా । లేకసు నీకు । పాతకాగనాది సుర । లేకమై తోడైననిను
భూ । లోకమున నీరూపము । లేకుండ జేసెదజూడు ॥మూ॥

ఘ॥ వరస నీకొప్పుగాయినట్టి । బంధువర్గమును బట్టి । శిరసులు గోసి
యురములు జీల్చివైతురా । ధరణిగొల్వపట్ల పుర । వరదునిసాక్షిగ
నిన్ను దురములోని బట్టియిప్పుడె । మరణము నొందింతుజూడు
॥మారీ॥

ఘ॥ మాట. అరే దురాత్మా! పొట్టకొ్రివ్వుచే నాగుట్టుదెలియక మిట్టి
మిట్టిపడియెదవు యిట్టిపట్టివాదంబేల? గట్టిగా కయ్యంబునకు రమ్ము
నాదిట్టతనంబున నీపొట్టకొ్రివ్వుదీసి పొ్రద్దువట్టి పట్టణంబునకనిపెద.

ఘ॥ సీ. అర్కనూనునిమాట ♦ లాలకింపుచు నీవు। పాండుగాత్రనయుల♦
బరమహితుల । మాయజూదంబున ♦ మహియును సంపదల్ । గై
కొనివారల ♦ గహనసీమలకు । బంపి యుదంబున ♦ పార్థపుత్రునకిచ్చు।
పొలతిని యిప్పుడు నీ ♦ పుత్రునకును । పెండ్లిజేసుకపోవ ♦ బ్రేమ
తో జనుదెంచు । నిన్ను నీకొడుకుల ♦ నఖిలహితుల । గళము
లనుదురించి పుడమికి ♦ బలియొనర్చి । సింధుపురమునకుజని ♦
యంధుడైన । కుంబికాత్మజు బంధించి ♦ కుంతిని దుఃఖ । సింధువున
ముంచి ముంచి ♦ సిగనుగోతు.

ఘ॥ మాట. అరే దురాత్మ దుర్యోధనా! నిన్ను నిముస మాత్రంబున
నీపుత్రమిత్రసోదర సమేతంబుగా పుడమిపైగూల్చెదను జూడుమురా.

ద॥ అరే దైత్యాధమా!

ద॥ గీ. ఘోర దైత్యాధమా యిట్లు ♦ లదర నేల । బలముగలిగిన
రమ్ము యీ ♦ బవరమందు । కఠిన శరములచేత నీ ♦ కండలెల్ల
జీల్చి శమనునిపురికి నే ♦ జేర్తునేడు.

దు॥ మాట. అక్కడ దురాత్మా! దైత్యాధమా నీవెందుకిట్లు పేలెదవు నీకుబలంబుకల్గిన బవరంబునకురమ్ము నిముసమాత్రంబున జయుపు రంబు జేర్చెదను.

ఘ॥ మాట. యేమేమి యేమేమి దుర్యోధనా! భళాభళా మంచిది కానిమ్ము.

దు॥ మాట యేమిరా దైత్యాధమా.

ఘ॥ దు॥ సంవాదం దరువు – అఠాణారాగము – ఆటతాళం

ఘ। తగునటరా నాతో నెదిరిబల్క ॥త॥ తగునటరా నీతప్పు గురెరు గక । నగముతో మార్కొను । తగదురీతిని నేనే । మగతనము గలవాడననుచును । మాటిమాటికి బల్కుచును వడి । పొగరుచే నను గదిసెదవు నిను । సగముగా జీల్చెదనుజూడుము ॥త॥

దు॥ యేరా దైత్యాధమా నాతో । యిటుబల్కెద ॥వేరా॥ యేరా దుర్మార్గ నా । ధీరత్వమెరుగక । ధారుణిలో నిన్ను దండించువీరులు। లేరనుచు పలుమారుబల్కెద । వేర నాతో నెదిరిపోరుము । క్రూర శరములు గ్రుచ్చి నేనీ । గుండెలరు జీల్చెదను జూడుము ।యేరా॥

ఘ॥ న్యాయము దప్పి యన్యాయమనక నీవు । మాయాజూత్యంబాడ మర్యాదగునే నీకు । వేయుమాటలికేల బ్రతుకు ను।పాయమాలో చించుకొనుమిా । సాయకముచే యిప్పుడే నిను । సదమదము జేసెదను జూడుము ॥దగునటరా॥

దు॥ మాయాజూత్యదమంచు । మమ్ముదూషించెదవో । మాయాయుద్ధము జేయ । మర్యాదగునేనీకు । మాయెదుట నిలువంగలేకను । మాయలెన్నో జేసెదవు నీ । కాయమెల్లను జీల్చి క్రిందలు। గద్దలకు వేసెదనుజూడుము ॥యేరా దైత్యాధమా॥

ఘ॥ తనయుని పెండ్లికై । యనుజులతో గూడి । అనుమానించక నీ ప్ర। వరుదెంచితివి గంగా । తనయుడిది దగదనుచు దెల్పిన । వినక జను

దెంచితివి నీవిటు। గనుము యూథునకరము చేసి। కండక్రొవ్వడలించె
దను భళీ॥ తగునటరా నాతో॥

దు॥ పలదురా నీకింత వైరమేలరా నాదు। బలము దెలియలేక। బలుకు
చుండెద వేర। ఇలను గొల్వపల్లిపురమున। వెలయు శ్రీగోపాలు
సాక్షిగ। దొలగిపోకను నిలువుమిక భూ।తలమునందున గూల్చెదను
భళీ॥ యేరా దైత్యాధమా॥

ఘ॥ ద్వి॥ ఓకోరి దుర్మార్గ యోరి రారాజ॥ యోరి జయద్రథ యోదు
స్ససేన। యోరి ద్రోణాత్మజ యోరోరి కర్ణ। యోరి భూరిశ్రవ।
యోరోరి శకుని। యోరి కృపాచార్య। యోరి బాహ్లీక। యోరోరి
వృషసేనా। యోసోమదత్త। మీరూరకేయిల్లు।మిడుక నేమిటికి। నీరా
యుధుని జూడ। శీఘ్రమేమిన్ను। దారాసుతులతోడ తద్దయు
నిప్పుడే। జేరుతుజముపురి। స్థిరముగా వినుడు.

మాట. అరే కర్ణ వర్ణసంకీర్ణ.

గీ॥ ఓరి రాధేయ నీదు పం♦డ్ల దరదన్ని। శకునికర్ణంబు లోడిపెట్టి ♦
సత్వరమున। దుస్ససేనునిబట్టి నా♦దోర్బలమున। గండ క్రొవ్వంత
దీసెద ♦ గదనమందు॥

అరే దుశ్శాసనా.

గీ. ఓరి దుశ్శాసనుండ ము♦న్నోర్వలేక! పరమసాధ్విని ద్రౌపది♦బట్టియీడ్చి। నట్టికలమెల్ల యిప్పుడు నీ♦ వనుభవించు। నటుల జేసెదజూడుమీ యవసరమున.

మాట. అరే దురాత్మా! దుర్యోధనా మాతండ్రిగారి ప్రతిజ్ఞాభంగ
మవునని విచారించుచుంటిని గాని లేకున్న నిమిషమాత్రంబున
నిన్ను ద్రుంచెదనురా. దురాత్మా!

(అనుచు కిరీటంబు గూలదన్నుట.)

దు॥ మాట. ఆహా రాధేయా యింకనేదియయినను శశిరేఖా లక్ష
ణుల పరిణయప్రసంగతి నాలోచింపుడు.

సంధి. ఇట్లు బల్కుచున్న సమయంబున కృపాచార్యుండు దుర్యోధనుగా గాంచి యిట్లనియె.

కృపా॥ మాట. దుర్యోధనా!

దు॥ మాట. యేమేమి కృపాచార్యా!

కృ॥ క. ఎప్పటి గుసగుసలనువిడ। విప్పుడు సైన్యంబులెల్ల ♦ నీల్గుటకొరకే। యిప్పనివలదని కృష్ణుడు। జెప్పిన వినలేక నిట్లు ♦ జేసితివకటా

కృ॥ మాట. దుర్యోధనా యింక యిప్పటియట్లిందుకు గుసగుసలాడెదవు చాలుచాలు.

గీ శేషశాయిని గడువెలి ♦ జేసినపుడె। చేటుమూడెను యికవేరె జెప్పనేల। నర్జునుడు రేపుమాపు నీ♦ కాప్తుడగుచు। నెనగ జేసిన దుర్నీతి ♦ యింత జేసె॥

గీ. మిన్ను జూచిన బాణంబు ♦ లెన్నొ దోచు। మన్ను జూచిన బాము లెన్నెన్నొ దోచు। బొసగ దిక్కులుజూడ బె ♦ బ్బులులుదోచు। నిలువ శక్యముగాదిట ♦ నీకు మాకు.

కృ॥ మాట. దుర్యోధనా పాండుపుత్రులకు పరమాప్తుండయినట్టి యాపుండరీకాక్షుని మహిమ తెలియంజాలక నాతని వెలిజేయగా నౌదవిః చేటడియేలదప్పును?

(అంత కర్ణుండు కృపాచార్యుంగాంచి యిట్లనియె.)

కర్ణు॥ మాట. ఒరే దురాత్మా బ్రాహ్మణాధమా! యేమిఃవచించెద వేమివచించెదవు? యిట్లు నావీనులకు విన చవిగాని వాక్యంబులు వచించెదవేని యీఖడ్గంబున నీసిరంబుద్రుంచెదను. దురాత్మా.

సంధి. ఇట్లు పల్కుచున్న కర్ణునింగాంచి అశ్వద్ధామ యిట్లనియె.

అశ్వ॥ మాట. అరే దురాత్మా కర్ణా! వర్ణసంకీర్ణా.

అ॥గీ. కౌరవులుజేరి యెంగిలి ♦ గడుపునిండ। భక్షణము జేసిప్రుడమిని♦ బ్రతుకుచుంటి యెగ్గుసిగ్గులు లేక నీ ♦ వెందుకిట్లు। గొప్పకొంచెంబు లెన్నక ♦ గొప్పబల్క.

అ॥ మాట. అరే దురాత్మా కర్ణా కౌరవుల యెంగిలికూడు భుజించి మత్తుండవయి గొప్పకొంచెంబులెన్నక పేలుచుంటివా? యింక మీద బ్రదుకుమార్గం బేమో యాలోచించుకొమ్మ.

కర్ణు॥ మాట. యేమేమి బ్రాహ్మణాధమా.

క॥ గీ పప్పు బొబ్బట్లు మొదలగు ♦ భక్ష్యవితతి। రాజ్యమున జేర్చి
దినుబ్రాహ్మ ♦ ణాధములకు। సంగరంబున నిలువగా ♦ శక్యమగునె।
నోరుమూసుక నొకమూల ♦ నొదుగుమింక.

మాట. అరే ద్రోణపుత్రా జాగ్రతగా వచింపుము. బొబ్బట్లు మొదలగు భక్ష్యంబు లాజ్యంబున జేర్చి భక్షించెడి బ్రాహ్మణాధములా సంగరంబున నిలుచువారు మంచిదిట్లు సంభాషించెదవేని నీశిరంబు ద్రుంచెదను.

అశ్వ॥ యేమేమి? యేమేమి?

దర్వు-సౌరాష్ట్రరాగం-అటతాళం

అశ్వ॥ యేరా క్రూరాత్మ నా శౌర్య మెఱుగక। మీరిబల్కెద వేలరా। నేనే। వీరుడనని నీవు। విర్రవీగకు డొక్క-జీరి। జముపురిజేర్తురా ॥యేరా॥

కర్ణు॥ బాపడనీవిట్లు। భాషించనేల నీ। కోపమడంచెదరా యీభూపతులుజూడ। పుడమిపైగూల్చి నీ। రూపుమాపెద జూడరా। ॥యేరా॥

అశ్వ॥ బలముగలదటంచు। బల్కి పొంగకురోరి। ఖలుడ ఛీ ఛీ పో పోరా। యిట్లు। తులువతనముచేత। దూలనాడెదవు యీములు కులచే జీల్చురా॥

కర్ణు॥ మదమెక్కినీవునన్నెదురించెదవుకల। మొదడుదీసెదజూడరా। ఓరి అదరకురా యీ। కదనమందునిన్ను। సదమదంబుజేతురా॥

అశ్వ॥ యేమిరకర్ణ సిగ్గేమిలేక యింత। తామసమింకేలరా నిన్నిభూమిలో గొల్వేవల్పురవరు సాక్షి సం। గ్రామమందున ద్రుంతురా

మాట. అరే! దురాత్మా! నేను మద్భుజాదండమండిత కోదండవిముక్త ప్రచండ కాండంబులచే నిన్ను ఖండనంబున ఖండించి కండలెల్ల జీల్చి గండుగుక్కలకు తిండిగా వేసి పండుగ గావించెద జూడుము ఛీ రండా కులహీనుండా.

కర్ణ॥ మాట. ఒరే బ్రాహ్మణాధమా! నీవెందుకిట్లు ప్రేలెదవు నీకు పౌరుషంబుగలదేని బవరంబునకుం రమ్ము నిముసమాత్రంబున ద్రుంచెదను.

అశ్వ॥ ద్వి॥ ఓరోరి దుర్మార్గ యోరి రాధేయ । సారెసారెకు నిట్లు జదువనేమిటికి । యోబుద్ధిహీన సుయోధనాధముడు । నీబొల్లుకూతలు నిజమనినమ్మి । సుజ్ఞానులగు పాండుసుతులతో వైరమజ్ఞానమున బూని యంబుజనాభు । సరకుసేయక కేలి కలుపుచునుండె । స్థిరముగా మరణంబు సిద్ధంబు మీకు,

మాట. అరే దురాత్మా! కర్ణా! మదించిన యాబోతువలె కన్నులు మూసుకొని మీదకు దుముకెదవేమిరా ఇంకమీదట్లు ప్రేలెదవేని నీకంఠంబు యీశరంబుచే ద్రుంచెదను జూడుమురా.

కర్ణ॥ మాట. యేమేమి బ్రాహ్మణాధమా! ఇంక నీవిట్లు పచించెదవేని యీఖడ్గంబుచే నీశిరంబు ద్రుంచెదను జూడుమురా.

( యిద్దరు కలియుట. )

కృ॥ మాట. ఆహా యోరి ద్రోణపుత్ర కోపంబున కిది సమయంబుకా దుడుగు మడుగుము.

దుర్యో॥ మాట. కర్ణా కోపంబున కిది సమయంబుగా దుడుగు ముడుగుము.

( అనుచూ ఖడ్గంబుల లాక్కొనుట. )

క॥ మాట. రారాజా నన్ను విడువుము వాని పొట్టక్రొవ్వుదీసెదను.
దు॥ యిది సమయంబుగాదుడుగుము రాధేయా.

అశ్వ॥ మాట. దుర్యోధనా నానిని విడువుము విడువుము యిప్పుడే వాని క్రిందలుజీల్చి గద్దల కాహారంబుగా వేసెదను.

సంధి ఇట్లున్న సమయంబున ఘటోత్కచుండు గగనవీధినుండి రాళ్లు పిడుగులు మలమూత్రింబులు వర్షంబుగ గురిపిం నంత కృపాచార్యుండు దుర్యోధనుం గాంచి యిట్లనియె.

కృపా॥ మాట. దుర్యోధనా మనమింక యీబయలనిల్చి బ్రదుకుట యబద్ధంబు గాన విచారించనేల నెప్పటిచోట్లకు పోవుదము లెండు లెండు.

కౌరవులు మాట. ఆహా యెంతపరాభవమయ్యెను.

( దుఃఖించుచు పారిపోవుట. )

బ॥ మాట. ఆహా యిది యెవ్వడో దురాత్ముండగు రాక్షసాధముండు సేయు మాయోపాయంబుగా దోచుచున్నదిగాన యీ హాలాయుధం బుచే ద్రుంచెదను.

బ॥ నలుదిక్కులు చూచునంతలో గగనమార్గంబున ఘటోత్కచుండు ధ్వని చేయుట.

బ॥ (ఆలకించి)మాట. ఒరేమరా త్మా! దైత్యాధమా!నీవిట్లంబరవీధినుండి మాయాయుద్ధంబుజేయు టొక మగతనంబుగాదు యిప్పుడు నన్నెదిరిపోరితి వేని యీశకటనమందు నిన్ను ఖండించి కాకులకు భక్షణంబుగా జేసెద జూడుమురా.

( హాలాయుధంబు ద్రిప్పుట, )

సంధి॥ ఇట్లు బలభద్రుండు ప్రళయకాలరుద్రునివగిది కోపోద్దీపితమానసుండై హాలాయుధంబుధరియించి నిలచిన గగనవీధినుండి ఘటోత్కచుండు మలమూత్రింబులును నిప్పులును వర్షంబుగా గురిపింప బారి కృష్ణునింగాంచి యిట్లనియె.

బ॥ మాట. సహోదరా కృష్ణా యిది యేమిచోద్యము!

కృ॥ అదేమి భలభద్రా.

సీ॥ ఏమని దెలుపుదు ♦ నిందిరానాధ నే । భుజగంబులును పులుల్ ♦ భూతములును । మండ్రిగప్పలు తేళ్ళు ♦ మర్కటస్తోమంబు । జగతిపై బరచిన ♦ చందమయ్యె । చేలను గ్గొలగంగ ♦ చెలు లెల్లబారి । బ్రాహ్మణులందరు ♦ బరువులిడిరి । శస్త్రాస్త్రములపొదుల్ జగతిపై నిండెను।అంసు యోధను గతి♦ తెలియదాయె। కాళ్ళులంబులుజచ్చెను♦ శిరలుజచ్చె । దురగముల్ జచ్చె తేరులు ♦ విరిగిపోయె । యింతసని సేయు నెవడొకొ ♦ హేతు వేమి । దెలిసినట్లైన దాచక ♦ దెల్పు మనఘా.

బ॥ మాట. సహోదర కృష్ణా నేనేమిజెప్పుదు నెవ్వడో దురాత్ముండు గగనమార్గంబునుండి యురగాద్యనేక విషజంతువులును మలమూత్రంబులును వర్షంబుగా గురిపించుచుండె నంత సైన్యంబు లనేక దెబ్బలుదిని కాళ్ళు విరిగియు చేతులు విరిగియు నురంబులుబగిలియు శిరంబులుదెగియు నిట్లనేకవిధంబుల దుఃఖంబుచే బారునట్లుజేయు దురాత్ముండెవ్వడో దెలియదాయె నీకు దెలిసినట్లైన దాచక దెలియజేయుము.

కృ॥ (నవ్వుచు) మాట. ఆహాబలభద్రా ఎరిగిచేసిన పనికింత పగపేల.

బ॥ అదేమికృష్ణా.

కృ॥ గీ. పట్టివిత్తువటంచు తో ♦ బుట్టుకోడ । గట్టిగాబల్కుమాటలు ♦ గట్టిబెట్టి । రట్టుకొడిగట్టి తోబుట్టు ♦ దిట్టి యిల్లు । వెళ్ళగొట్టిన చేటు వా ♦ టిల్లె నీకు.

కృ॥ బలభద్రా!

కృ॥ ద్వి॥ వినుమన్న బలభద్ర పేశసుభద్ర । తనకుమారునికూడి దగ నర్ధరాత్రి। వనముల కేగగా వడముడి కొడుకు । గని వచ్చుటది యేమి కారణంబనిన । నీవాడువాక్యముల్ నిజముగా దెల్ప । దేవారి వినియార్చి దిక్కులుప్రేల । బటుకోపమున లేచి పుండ్లుదీటుచును ।

యిటజేరినీపుత్రినెత్తుకవోయి । తనవనంబునడించి తక్షణంబున నె । జనుదెంచి తానె యా జవ్వనియగుచు । గర్వభంగము మాకు గావింపదలచి । సర్వము నీరీతి సల్పె దానిపుడు.

మాట. నే చెప్పినమాటలన్నియు యదార్థము బలభద్రా.

బ॥ యేమేమి యేమేమి కృష్ణా

దరువు-కాంభోజిరాగం-ఆటతాళం.

యిటులజేయ౯టి యిష్టనుగునే నీ ॥కిటు॥ యిటులజేయ సుభద్రనీకిపు । డిదియు ధర్మమటంచు దోచెనే ॥యి॥ మాధవా వేయు మాటలింకేటికి । భోదరములు చలించినను నా । పుత్రికను నరుసుతున కిత్తునే ॥యి॥ వినుము యిప్పుడా దనుజాధముండుండు వనమునకు జని యాదురాత్ముని । ఘనులు బొగడగ ద్రుంచెదను భళీ ॥యి॥ ధరణిగోత్రేవలు । రవందా నా । వరసుతను దెచ్చి నే డీ కుంజరపురేంద్రుని సుతునకిచ్చెద ॥యిటుల॥

బ॥ మాట. కృష్ణా మనచెలె లిట్లుచేయు టుచితంబే నేనిందురేఖ నివ్వనంటినేగాని యిల్లువెడలిపొమ్మని యెవ్వరనిరి. ఇట్లు నన్నవమానపచ్చుట నీకు సమ్మతమే సహోదరా! మంచిది యయినను నా దానవాధముండు నాకచ్చుల కదృశ్యుడగుటం జేసి యా దురాత్ముని సామర్థ్యంబుజెల్లె నిప్పుడా దురాత్ముండుండు వనంబునకేగి నిముసమాత్రంబున వాని శిరంబుద్రుంచి యిందురేఖ దెచ్చి యాదుర్యోధనపుత్రున కిత్తునుగాని యాసుభద్ర యెంతజేసినను తనకుమారునకిత్తునే సహోదర కృష్ణా! మంచిది నేనుత్వరగా నావనంబునకు బోయెద.

కృ॥ మాట. బలభద్రా యెందుకిట్లు వచించెదవు చాలు, చాలు.

కృ॥ దరువు-వసంతరాగం-ఆదితాళం

వినుబలభద్ర । యీవెర్రిమాట లేటికి । మనమున రోషము మానుము ఖాళిక ॥విను॥ దనుజుడుండినయా । వనమునకు నీవ్రజనిన

తిరిగిరా సాధ్యమగునే భళి ॥విను॥ రావణాసురుబోలురణగర్విష్ఠుడు వాడు పోవలదు నీవి । బుద్ధిమానుము యిక ॥విను॥ కయ్యములో సితి కంఠుగెల్చిన నరుతో । వియ్యమందకయిటు । వెర్రిగా బల్కనేల ॥విను బళభద్ర యీ॥

కృ। గీ. కూడుకోకలులేక నా ♦ కొంపకిప్పుడు ॥ జేరితిరి యనిబల్కుట♦ శీఘ్రముగను । వెడలి పొమ్మను టేగాదె ♦ వెలది యందు।నెగ్గుగల దని చెప్పుట ♦ సిగ్గుగా దే.

మాట. బలభద్రా సుభద్ర మనయుంనుగల పేర్మాతిశయుంబున యాదవ కౌరవులనెల్ల జంపవలదని సెలవొసంగుట జేసి రక్షించ లేకున్న లోకవిద్రావణుండగు రావణునకు సమాన విక్రముడీ ఘటోత్కచుండింద్రాదులకును జయింవనసాధ్యుండుగా నుండుగాన నీవా వనంబునకుఁ బోయిన తిరిగి ప్రాణంబులతో వచ్చు టసాధ్యంబుగా నుండుగాన నీవుపోవలదు. యిదియునుంగాక.

కృ॥ గీ. అర్జునునిపట్టి కివ్వకీ ♦ యబ్జరేఖ । నిభవరేంద్రునిపుత్రున ♦ కిచ్చుటెల్ల । పన్న గేంద్రశనుని తోడ ♦ బగవహించి ! చెలిమి కాకముతోడను ♦ జేసినట్లె.

మ. ఆహాబలభద్రా యా మృత్యుంజయునితో బోరి పాశుపతాస్త్రంబుగొన్న నావిజయునితో వియ్యంబందక వెర్రివై యెందు కిట్లు జేసెదవు.

సంధి॥ ఇట్లున్న సమయంబున ఘటోత్కచుండు కౌరవులు ధరాతలంబునఁగూలినట్లు మాయగల్పించి బలరామునిఁ గాంచి యిట్లనియె.

ఘ॥ కంఁదార్ధం దర మేనల్లుండుండగ । బరులకు పుత్రికనొసంగ భావ్యంబగునే । నరసుతుడుండగ నీసుతన్। గురుపతిపుత్రున కొసంగు। కోరికదగునే । తోబుట్టువను । దూరుట దగునే । కూ్రరుడవై మీాకు కూటికి మా కొంప ! జేరితిరని బల్కెల్లునే । దురి

తాత్మా । తారతమ్యము లేక । నీవిటు తప్పుమాటలు గూసితివి యీ క్రూరశరముల నిప్పుడే నీ । గుండెలను జీల్చెదను భళి ॥పరు॥

ఘ॥ మాట. అరే బలరామా! నా మేనిలో జీవంబులుగలిగి యున్నంత వరకు నీ భావంబునన్ దలంచు కార్యంబుగావింప నీకును కౌరవపతి కిని వశ బే

బ॥ మాట. ఆహా యేమీ చిత్రము యీ పిన్నతమ్ముని మాటలన్నియు నిశ్చయంబుగా దోచుచుండెను. యింక నేనేమి సేయుదు. యీ పద్మాక్షుండు పక్షపాతిగా నుండుటచే యీ రక్కసులరేని కీపరాక్రమంబు చెల్లె. వీని చిత్తంబు మున్నెరుంగనైతి. నింక నేనేమి సేయుదును.

కృ॥ మాట. బలభద్రా!

కృ॥ గీ. వినుము బలభద్ర నీమాట ♦ వనజముఖికి । విజయు పుత్రుని మీదను ♦ విజయపుత్రు । ప్రేమ నీపుత్రిమీదను ♦ బెక్కులేల దగిలియుండెను నెడబాప ♦ దగదు వారి.

కృ మాట. బలభద్రా! యెందుకిట్లు చింతించెదవు యీ విజయసూను నకు నీ పుత్రికనిచ్చి పరిణయంబు జేయుము. యిప్పుడా భీమనంద నుని నెమ్మదిగా సంధికి బిలచెదను.

కృ॥ ద్వి॥ ఓయి దానవనాథ యో భీమపుత్ర । యోయి ఘటోత్కచ యో కీర్తిసాంద్ర । వనిత నెత్తుకపోయి వనమునడించి । జనుదెంచి యందరిజంపజూచెద వి । దేమిసాహసమోయి యిక జాలుచాలు। మామపై వైరంబు మానుమింకైన । రావణాసురుబోలు రణగరి ష్ఠునవు । సావధానుండవై సంధికిరమ్ము । నరుకుమారునకు నీ వలి నాక్షినిచ్చి । స్థిరముగా పెండిలి జేతు నిజంబు.

కృ॥ మాట. ఓయి భీమపుత్రా! మీాయిరువురకును గయ్యంబు గాల విశేషంబునగల్గె. నిప్పు డరుదెంచితివేని నీ తమ్మునకిందు రేఖనిచ్చి పరిణయంబు జేయించెదను రమ్ము.

సంధి॥ ఇట్లు శ్రీకృష్ణుని వాక్యంబులు విని ఘటోత్కచుండు ముకుళిత కరకమలుండై కృష్ణునింగాంచి యిట్లనియె

ఘ। కం వందనము వాసుదేవా । వందనము సురేంద్రవినుత వనరుహనయనా । వందనము వైరిగుర్జన । వందన మిదె గొనుము దేవ ♦ వారిజనాభా.

ఘ॥ మాధవా నమస్కరించుచున్నాను.

కృ॥ భీమపుత్రా! గూర్చుండుము.

కృ॥ గీ. విను ఘటోత్కచ యారీతి ♦ బెచ్చురేగి । కురుబలంబుల జీకాకు ♦ బరచి ద్వార । కా పురంబంతయు నొక్క ♦ కడకు దెచ్చి । నాడవీ సాహసంబులు బూ ♦ నంగ దగునె.

ఘ॥ కృష్ణా!

ఈ. హాటకచేలమా యెడ ద ♦ యార్ద్రహృదాబ్జుడవౌచు నీవిటుల్ । మాటలువేయునేల గొ ♦ మాని తటస్థతనుంటజేసి నా । యాటలు సాగె నీవె యిను ♦ సంతకృధం బెదనూన స్వర్ధునీ । జూటముఖా ఖిలామరులు ♦ జూడగ నోడుదు రెంతవాడనేన్.

ఘ॥ మాట. కృష్ణా!

గీ॥ నీకు తోబుట్టువై భువి ♦ నెగడునట్టి । యలసుభద్రను బలరాము ♦ డాడరాని । కఠిన వాక్యంబులను బల్కి ♦ కౌరవులకు । బాల నొసగెదనని బల్క ♦ భావ్యమగునె.

మాట. నీకు తోబుట్టువైన సుభద్రను బలరాముం డాడరాని యవమాన వాక్యంబులాడి యిల్లు వెళ్ళగొట్టిట్లు చేయుట ధర్మమే కృష్ణా!

సంధి. ఇట్లు బల్కుచున్న సమయంబున బలరాముండు తన మనంబున వితర్కించుచుండె నెట్లనిన.

బ॥ మాట. ఆహా శ్రీధరుండు దెల్పిన పల్కులు చెవి సోకనీక చపలాత్ముండనై చెలియలి కవమానంబుచేసిన ఫలంబంతయు నేడు నాకు సంప్రాప్తంబయ్యె. యింక నేనేమిసేయుదు. దానవేంద్రా.

దర్బారాగం-శంకరాభరణము-ఆదితాళము. పల్లవి సంఖ్య......

దనుజేంద్ర వినుము నా । తప్పులెన్నక । జనపత్తుల్లనప్ప డరి । చలమునగావుము॥ద॥ కాలవశంబున గలిగె విరోధము । చాలు చాలునింక । సదయుడవగుము ॥ద॥ మతిదెలియలేక నా । సుతను దుర్యోధను । సుతునకర్పింప యిా। గతిగల్గె మాకిపుడు ॥దను॥ ధరణి గోల్వేపల్లి । పురవరు సాక్షిగా । వరపుత్రికను యీ । వరుసుతున కిచ్చెద ॥దను॥

బ॥ మాట దానవేంద్రా మాకును మీకును విరోధంబు కాల విశేషం బునగల్గె నింక చాలుచాలు నీతమ్మున కిందు రేఖనిచ్చి నిశ్చయం బుగా పరిణయంబు జేసెదను. నా కపకీర్తిరాకుండ యీ వచ్చిన రాజపుత్రులకు బ్రతుకజూడుము దానవనాథా.

ఘ॥ మాట. యేమేమి యేమేమి బలభద్రా యీ దురాత్ముండగు దుర్యోధనుని పరివారసమేతంబుగా పొలికీర దాటదోలించి తదు పరి నాతో ప్రసంగింపుము.

బ॥ మాట. మంచిది అట్లేబంపెద దానవేంద్రా!

ఘ॥ మాట. ఆహాహా! యెంతమాటవింటి నీ వచనంబులకు నాడెందం బానందంబొందును బలభద్రా!

బ॥ మాట. సాత్యకీ నీవు త్వరగానేగి యీక్షణంబుననే కౌరవులను పుత్రమిత్ర సోదరసమేతంబుగా లేచిపొమ్మని దెల్పిరమ్ము పొమ్ము.

సా॥ మాట. పోయివచ్చెదనన్నా బలభద్రా.

సం॥ ఇట్లు బలభద్రునాజ్ఞవడసి కౌరవులనుచేరి వారలంగాంచి యిట్ల నియె.

పా॥ గీ. ఓరి దుర్యోధనా కృప ♦ యోరికర్ణ । యోరిబాహ్లీక వృష సేన ♦ యోరిశకుని । మీరు మాయూరుపంచను ♦ మిణుక నేల । జావు దప్పించుకొనిపొండు ♦ చాలుచాలు॥

మాట. ఔరా దుర్యోధనా! ఔరా కర్ణా! ఔరా కృపాచార్యా! ఔరా ద్రోణపుత్రా! ఔరా దుశ్శాసనా! యింక మీరిచ్చట నిలచితిరేని యీ దానవేంద్రుడు మిమ్ముల నిముసమాత్రంబున నిశ్చయంబుగా యమపురంబు జేర్చును గాన త్వరగా లేచి పొండు లేచిపొండు.

స॥ ఇట్లు సాత్యకి వాక్యంబులు విని కౌరవులనేకవిధంబుల దుఃఖించుచు కరిపురంబు జేరిరంత ఘటోత్కచుండు బలరామకృష్ణుల సెలవుగైకొని తన వనంబునకుం జని యీ వృత్తాంతంబంతయు సుభద్రాభిమన్యులకున్ జెల్పి సంతోషసాగరంబునం దేలుచుండె నంత సూర్యోదయంబైన ద్వారకాపురంబున శ్రీకృష్ణుండు నిద్రలేచి కాలకృత్యంబులు దీర్చి స్నానంబుజేసి తిరుమణితిరుచూర్ణంబు దిద్ది హారకటక కేయూర మకుటాంగుళీయకాద్యాభరణంబులుదాల్చి బలభద్రానిరుద్ధ సాత్యకీసమేతుండై వెడలి ఘటోత్కచు వనంబుజేరి వారిచే నుచితసత్కారంబులుగైకొని సుభద్రన్ గాంచి యిట్లనియె

కృ॥ మాట. అమ్మా సుభద్రా ! నేవచ్చిన పనిని దెల్పెద వినుము.

సు॥ అదేమో చెల్లుమన్నా కృష్ణా.

కృ॥ గీ. బలుని మాటలు మదిలోన ♦ దలపకిప్పుడు! తల్లి రావమ్మ వెంటయీ ♦ తరుణమందు! నిందురేఖను సౌభద్రు ♦ కిచ్చి పెండ్లి! ఘనముగాజేతు రావమ్మ ♦ కమలనేత్రీ.

కృ॥ మాట. అమ్మా సుభద్రా తెలియక బలరాముం డాడుమాటల కలిగి నీవిట్లుచేయు టుచితంబుగాదు యిప్పుడే నీలాంబరుండునిన్ను దోడ్కొనిపోగలండులకు జనుదెంచె గాన త్వరగా మనపురికిన్ బోవలయు లెమ్ములెమ్ము.

సు॥ మాట అన్నయ్యా మీరెంచుకిట్లుచెప్పెదరు. యీ కామపాలుండు కర్ణకఠోరంబగు వంకరవాక్యంబుల వచించి లేచిపొమ్మనిన తద్వాక్యంబు లభిమన్యునకున్ దెల్పి నాతండు గోపించి నన్నున్ దోడ్కొని యీ రేయింబగళ్ళు రెండు దినంబులు గడచి యీ ఘోరారణ్యంబునకున్ దెచ్చె నంత నేనిచ్చటనిద్రింప వీరన్నదమ్ములను భావంబు

లెనసంగక పోరిపోరి తుదకు బ్రహ్మాస్త్రంబులు ప్రయోగింప నంత ఋషిశ్రేష్ఠుండగు పరాశరసూనుం జేతెంచి యున్నదమ్ముల భావంబు లెఱింగింప బతికిరి లేకున్న నృతులగుదురుగదా నేనేమి చెప్పనును కృష్ణా యిదియునుగాక.

గీ. భాగ్యవంతుని పుత్రిం ♦ బడుగులకును । నెందుకిచ్చెద రీవేళ ♦ నిందిరేశ । ధరణిఁ రారాజ సుతునకు ♦ తనయనిచ్చి । పరిణయముఁ జేయుగను గొప్ప ♦ భాగ్యమబ్బ.

మాట. అన్నయ్యా! భాగ్యవంతుని పుత్రికల మాబోటి నిర్భాగ్యులకేలనిచ్చెదరు. రారాజగు దుర్యోధనుని పుత్రున కిచ్చెదరుగాని.

బ॥ మాట. అమ్మా సుభద్రా! యెందుకిట్లు నిష్ఠురంబులాడెదవు. నెనవశంబున నే బుద్ధిహీనుడనై బొంకితి నాకతంబున నీవిపట్టణంబు బాసి యీ ఘోరారణ్యంబులఁ దిరుగుచు సకలబాధలను బొందుచుంటివి. ఇట్టి కల్మషంబు నాకు దప్పనే, యింక నభిమన్యున కిందురేఖనిచ్చి పరిణయంబుచేయక పార్థుని మోమెట్లుజూతును.

బ॥ మాట. కృష్ణా! యింక ద్వారకా పురంబునకు ప్రయాణంబు జేయుము.

కృ॥ మాట. బలభద్రుండాడు వాక్యంబులు మనంబునం దుంచక త్వరగారమ్మా చెల్లెమ్మా యమ్మా సుభద్రా.

సు॥ మాట, అట్లయిన తమ యిష్టప్రకారమే వచ్చెద కృష్ణా.

సం. ఇట్లు శ్రీకృష్ణుండు సుభద్ర నోడంబరచి ఘటోత్కచాభిమన్యులఁ దోడ్కొని ద్వారకాపురంబుఁజేరి పురం బలంకారంబుగావించి లగ్నకాలంబు నిరీక్షించుచుండెనంత నారదునిచే యీ వృత్తాంతంబువిని యింద్రార్జునులు జనుదెంచిన వారల నుచిత సత్కారంబులుగావించి యనంతరం బభిమన్యుని పెండ్లికుమారుని గావించి రత్నసింహాసనంబుపై గూర్చుండబెట్టెనంత.

బ్రా॥ మాట. అయంముహూర్తస్సుముహూర్తోస్తు.
పెండ్లికూతురను దోడ్కొనిరమ్ము.

(మంత్రములు చదువుట.)

శ్లో॥ వాగీశాద్యాస్సుమనస। స్సర్వార్థానా ముపక్రమే యం తత్వా కృతకృత్యాస్యు । స్తం నమామి గజాననం॥

బ॥ మాట కాలాతీత మగుచున్నది త్వరగా తెర తీసివేయుడు విప్రులారా.

(తెరవంచుట)

(అభిమన్యుండు మంగళసూత్రంబు గట్టుట)

సంధి. ఇట్లభిమన్యుం డిందు రేఖ కంఠంబున మంగళసూత్రంబు గట్టి న త్తరి బలభద్రుం డనేక మణిమయంబులగు భూషణంబులును పట్టు పుట్టంబులును దాస దాసీజనంబుల నొసంగె నంత నభిమన్యుం డిందాది దేవతలకును రామకేశవాది యాదవులకును నమస్కరించి వారిచే నాశీర్వాదంబులు గైకొని శశిరేఖ కరంబు గైకొని యంతఃపురంబునకుఁ దోడ్కొనిపోయె. నంత ఘటోత్కచుం డిచ్చట కొన్నినాళ్ళుండి గమనోన్ముఖుండై ద్వైతవనంబునకున్ బోయి పాండవుల కీవృత్తాంతంబు దెల్పి సంతోష సాగరంబునన్ దేలుచుండె.

మంగళహారతి రాగం

మంగళం మంగళం । మాధవ నీకు ॥మంగళం॥ మంగళం మంగళమయ్యా మాతంగపోషక భు । జంగతల్ప సారంగనేత్రా॥ అంగజ జనక శుభాంగ మాధుర్య ప్రసంగసన్నుత మానిపుంగవ నీకు ॥మం॥ రంగవిహంగ తురంగ దనుజాబ్జ మాతంగ సత్కరుణాంతరంగ ఖైరీ ॥ భంగసత్సంగ రమాంగనా హృదయాబ్జ । భృంగ మదు దానవ భంగ ఘనాంగ ॥మంగ॥ శరణని వేడిన జనులను బ్రోచెడి । బిరుదువహించిన

సరసిజాక్షా। శిరియురమున నాదరమున నిడుకొని। ధరణి గొల్వ।
పల్లి పురిని వెలయు శౌరి ॥మం॥

గద్య. ఇయ్యది శ్రీమద్వేణుగోపాలప్రసాద లబ్ధకవిత్వకల్పనా ధురీణ వల్లభనేని వంశోద్భవ బ్రహ్మాయాభిధాన ద్వితీయపుత్రచౌదరి నామధేయప్రణీతంబైన

శ శి రే ఖా ప రి ణ య నా ట క ము

సం పూ ర్ణ ము.

---

ని ర్మా ణ కా ల ము

కం. పదిలొమ్మిది వందలపై। పదయునొకటి సంఖ్యదనర్పు ♦ వత్సర మునన్। నిది కూచిపూడి విప్రుల। కెద ముదమున నేర్పి ఖ్యాతి ♦ నసగితి నిలలోన్.



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 3 | జోత | జాత |
| 3 | 13 | ఆరా | ఆధా |
| 3 | 24 | సర్గాగుడు | సర్దారుడ |
| 6 | 8 | దనంబు | దనంబు |
| 6 | 17 | ముప | ముప్ప |
| 7 | 11 | కృషుం | కృష్ణం |
| 12 | 9 | పత్రి | పుత్రి |
| 13 | 13 | పకువ | పగుప |
| 16 | 16 | ప్రవీణు | ప్రవీణ |
| 16 | 16 | లయిల | లగున |
| 16 | 16 | గణికా | గణికాం |
| 32 | 26 | వర్యులలకా | వర్యులకా |
| 36 | 23 | మాన్షణ | మార్ష్టుం |
| 43 | 25 | క్రొవ | క్రొవ్వె |
| 45 | 16 | భయు | భయూ |
| 46 | 3 | భక | భవ |
| 49 | 6 | భీమా | భీము |
| 50 | 8 | హలాధు | హలాయుధు |
| 53 | 2 | సాటి | సాటి |
| 53 | 17 | బుద | బున |
| 54 | 5 | యుచిత | యుచ్యుత |